

సనాతన, అధునాతన వార్తాహరులు

— ఫొటో  జి  రామలింగేశ్వరరావు

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder K NAGESWARA RAO**

సంపుటము 46
సంచిక 22
26-1-55


జయ మాఘ శుద్ధ తృతీయ బుధవారం



శ్రీ యు. యన్. ధేబర్

60-వ కాంగ్రెస్ అధ్యక్షులు.



# బారిష్టరు గారి బాతాఖానీ

మొక్కపాటి నరసింహశాస్త్రి

నేను మామూలుగా క్లబ్బుకు వచ్చేసరికి మా ముఠావాళ్లు ఎవళ్ళూ కనపడలేదు. అంతా ఒక్కసారి ఎందుకు మాయమయ్యార్రా అనుకుని, కుర్చీలో కూలపడి, ఏమీ తోచక పేక తెప్పించి *Patience* ఆడడం ఆరంభించాను. రెండు మూడు సెట్లు అయ్యాయి. మావాళ్ళ జాడేమీ లేదు. ఏమయ్యార్రా వాళ్ళు. ఏదేనా ప్రమాదం జరగలేదుగదా; పోలీసులకు తెలియపరుస్తే నయమా, లేక పదిమందిని కూడ తీసుకుని ఊరు నాలుగు మూలలా గాలించడం మంచిదా అని ఆలోచిస్తూ మళ్ళీ కొత్తసెట్టు ప్రారంభించాను.

ఇంతలో తప్పతాగినవాళ్ళు ఒకర్ని ఒకరు ఆసరా చేసుకుని తూలుతూ వస్తారు చూచారూ, అలాగ మా రామం, భద్రం, శర్మ ఇరవైమైళ్ళ దూరం నడిచి వస్తున్నట్లు, అతి నిస్త్రాణగా కాళ్ళీడ్చుకుంటూ వచ్చి కుర్చీలలో చతికిలబడ్డారు. వెనకాల శాస్త్రి టప్పయ్యను, అరటిబొందను ఈడ్చుకొచ్చినట్టు ఈడ్చుకొస్తున్నాడు. నేనేదో కొంప మునిగిందనుకుని ప్రాణాలుగ్గపట్టి, 'ఏమిట్రా' అని ఓ వెర్రికేక వేశాను. వాళ్లందరూ అర్ధనిమీలిత నేత్రాలతో నాకేసి జాలిగా చూచి ఒక్క క్షణం ఓపికపట్టుమని సంజ్ఞ చేసి, అంతా ఏకగ్రీవంగా మూలాధారంనుంచి లాగిన శబ్దంతో 'కాఫీ' అన్నారు. నేను వెంటనే తెప్పించాను. ఈ దిక్కుమాలిన నిషేధమే లేకపోతే అసలు, కాస్త అసలు వస్తువే తెప్పిద్దామనుకున్నాను. వాళ్లు ఒకటి రెండు గుక్కల్లో కాఫీ పీల్చి అంతా ఏకగ్రీవంగా 'అమ్మయ్య' అన్నారు.

'దెబ్బలేం తగల్లేదు కదా' అన్నాను ఆత్రతతో. 'అదికాదు మేష్టారూ' అన్నాడు టప్పయ్య. 'నోరుముయ్యి' అన్నాడు శాస్త్రి. టప్పయ్య అందరికీ లోకువే-

'జిడ్డు. మహా జిడ్డు' అన్నాడు రామం. 'గ్రీజు. రైలు గ్రీజు' అన్నాడు భద్రం. 'జనపనార పచ్చడి' అన్నాడు శర్మ. 'అబ్బా, గానుగ కిర్రోయి బాబూ' అన్నాడు శాస్త్రి పెద్ద నిట్టూర్పులాంటి దీర్ఘంతో.

నాకేమీ అర్థంకాలేదు. వీళ్లేమైనా పరాకు మాటలాడుతున్నారా అనుకొన్నాను. 'ఏమిటి నాయనా' అన్నాను. 'మరేంలేదు, కంగారు పడకండి' అన్నాడు శర్మ. 'ఆపదలందు ధైర్యము అన్నాడు ఆ కవెవరో' అన్నాడు శాస్త్రి.

'మీమాట విన్నామా' అన్నాడు రామం. 'పెద్దలమాట పెడచెవినిపెట్టి చెడిపోయిన వాళ్ళం, చెడిపోతున్న వాళ్ళం, చెడిపోగల వాళ్ళమూను' అన్నాడు భద్రం.

'అసలు సంగతేమిట్రా. చెప్పకేం చస్తుంటేను' అన్నాను. 'ఏం చెప్పం బాబూ. మీరు వద్దంటుంటే వినక, బుద్ధి గడ్డితిని, ఆ దిక్కుమాలిన ఉపన్యాసానికి వెళ్ళాం, చచ్చి చెడి ప్రాణాలతో బయట పడ్డాం.' అన్నాడు శర్మ. 'అమ్మయ్య' అని పెద్ద నిట్టూర్పు విడిచాను. నేను నవ్వాలో ఏడవాలో తెలియలేదు. 'ఓరి మీ గోలకూలా. ఇదా ఇంతకూను. ఎంత నాటకమాడారు' అన్నాను నేను విచారంగా. 'ఆ కవిగారేదో పాడిచేస్తారనుకుని వెళ్లాం' అన్నాడు రామం. 'అయితే సభ జయప్రదంగా జరిగిందా' అన్నాను. 'ఓ. దిగ్విజయంగా జరిగింది. కాదు కాదు. పొరపాటు. ఇంకా జరుగుతోంది. అక్కడున్నవాళ్లకు ఆయుర్దాయం ఉన్నంతవరకూ జరుగుతుంది' అన్నాడు భద్రం.

'అయితే గురువుగారూ, మీ రెప్పుడూ సాధారణంగా ఏ సభకూ వెళ్లరెందుచేతను. మీ రోజుల్లో అట్టే ఉపన్యాసాలుండేవి కావా' అన్నాడు రామం. 'లేకేమి. ఎందుకుండవు. ఎప్పుడూ ఉంటాయి. వినేవాళ్లుండాలికాని, ఎన్ని వినంగే ఇంతవారయ్యారూ మన బారిష్టరుగారు' అన్నాడు శాస్త్రి.

'నిజమే విన్నాను. బోలెడన్ని విన్నాను. చెవులు చిల్లులుపడ్డాయేమోనని కూడా అనుమానం. అనేకసార్లు ఆ అపరాధం నేనూ చేశాను. అందుకని కొన్నాళ్లు ఉపన్యాసాలు ఇవ్వడంకాని వినడంకాని కూడదని నిశ్చయం చేసుకున్నాను. 'అలా అంటే ఎలాగు గురుదేవ్' అన్నాడు భద్రం. ఎలాగేముంది. సవాకోటి జంగాలలో ఓ జంగం

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
మీనాకుమారి.

గంట వాయించకపోతేనూ మరో జంగం శంఖం ఊదకపోతేను వచ్చే లోటేమీ లేదు బాబూ. ఈ రోజుల్లో అన్ని విషయాలను గురించీ ఉపన్యాసాలిచ్చేవాళ్లు కొన్ని లక్షలున్నారు. ఇంతమందికీ అన్ని విషయాలూ తెలుసునా అని అడిగేవు గనుక తెలియక్కర్లేదు. ఊకదంపు ఒక్కటి చేతనైతే చాలు. అది అదృష్టవంతులకు జన్మతః వస్తుంది. అస్మదాదులకు ప్రయత్నం చేసినా రాదు. అవిరతోపన్యాసకుడు ఒక ఆసామీతో 'ఏమయ్యా, గంటలాది మీరు అలా మాట్లాడుతారు. నాకు బాగా తెలిసిన విషయాన్ని గురించి కూడా ఒక్క పావుగంటేనా మాట్లాడలేను. ఎందుచేతనంటావు' అన్నాను. అతను 'ఓరి వెర్రివాడా' అన్నట్టు నాకేసి ఓ చూపు పారేసి 'అలవాటు కొంత ఉండాలనుకోండి. అంతకంటే ఏమిటంటే, మీరో పొరపాటు పడుతూ ఉంటారు. మీరు చెప్పేది బాగుందో లేదో, సభలో అంతా తెలిసినవాళ్ళుంటారు. వాళ్ళేమన్నా అనుకుంటారేమో' అని మీరు ఎప్పటికప్పుడు సందేహిస్తూ ఉంటారు. అందుకని మీకు ఉపన్యాసం వదులు [illegible] కుండా ఉం[illegible] చేస్తాను [illegible]ండి. మన సంగతి తెలిసినవాడూ, మనకంటె తెలిసినవాడూ మన్ని ఉపన్యాసమివ్వమనడు. అలాగే మన సత్తా తెలిసినవాళ్ళూ, మనకంటె విద్వత్తు ఉన్నవాళ్ళూ సభకు రారు. కాబట్టి సభలో ఉండేవాళ్ళు, విద్వత్తు విషయంలో మనకంటె తక్కువని తేలిందా. అందుచేత మనం ధైర్యంగా మన ఇష్టం వచ్చినట్లు మాట్లాడవచ్చును. అథవా, పెద్దవాళ్లెవళ్ళైనా ఒకరిద్దరున్నా మరేం ప్రమాదం లేదు. ఎందుకొచ్చామురా భగవంతుడా అనుకుని వారే లేచిపోతారు. లేదా చివరవరకూ కూచుని బాధపడతారు. మన్నేమీ అనరు. ఇది మేష్టారూ ఇందులో రహస్యం' అన్నాడు చాలా నమ్రతతో. ఆలోచించినకొద్దీ, నిజమే ననిపించింది. అన్నిటి మాటా ఎలా ఉన్నా ఈ ఒక్కటీ మట్టుకు బాగా తెలిసే చెప్పాడనిపించింది. ఆలోచించిన కొద్దీ దాని యాథార్థ్యం తెలిసి వచ్చింది. దేనికీ కొంత అహంకారం ఉంటేనే కాని వీలుపడదు.

పూర్వం ఉపదేశాలే కాని ఉపన్యాసాలుండేవి కావు. ఆ ఉపదేశాలు ఏ పాట రూపంలోనో పద్య రూపంలోనో చేసేవారు. లేదా పురాణాలూ హరికథలు చెప్పి ప్రబోధం చేసేవారు. అవి కేవలం ఉపన్యాసాలు అనిపించకుండా కొంత నృత్యం, సంగీతం కూడా ఉండడంచేతను, విసుగుదల లేకుండా ఉత్సాహజనకంగా ఉండేవి.

ఆంగ్లేయుల హయాం వచ్చిన తరువాతనే నేటి ఉపన్యాస ధోరణి ప్రారంభమయింది. మత ప్రబోధకులు ప్రతి ఊళ్లోనూ ఉపన్యాసాలు దంచుతుండేవాళ్లు. దేశీయ క్రైస్తవులు ఆ రోజుల్లో చదువుకున్నవాళ్లు తక్కువగా ఉండేవారు. వీరిలో కొందరిని ఏరి, హిందువులను వాళ్ల మతాన్ని ఎలా తిట్టాలో వాళ్లకు వ్రాసిచ్చి కంఠతా పట్టించి గ్రామాలమీద వొదిలేవారు మిషనరీ దొరలు. వీరు ఆ నాలుగు తిట్లూ వొప్పచెప్పి, అక్కడక్కడ మరి నాలుగు వడ్డీతో సహా తిని దక్కా వచ్చేవాళ్ళు, దొరల ఉపన్యాసాలూ హాస్యాస్పదంగానే ఉండేవి. మా స్కూలుకి ఒక మిషనరీ తరుచు వచ్చి మా కుపన్యాసాలిచ్చి ఏడిపించేవాడు. ఆయన ఎన్నిసార్లు చెప్పినా *Purity and Temperance* మీదనే. మమ్మల్ని టెంపరెన్సు సంఘాలు ఏర్పాటు చెయ్యమనేవాడు. మితిమీరి తాగమని ప్రమాణాలు చెయ్యమనేవాడు. ఆ రోజుల్లో మరీ తక్కువ వర్ణాలలో ఏ కొద్ది మందికో తప్ప, ఈ రోజుల్లోకి మల్లే అందరికీ అలవాటుండేది. ఇప్పుడు తాగనివాళ్ళు అల్పసంఖ్యాకులు. అప్పుడు తాగేవాళ్ళు అత్యల్ప సంఖ్యాకులు. అంతే తేడా. అందుకని మమ్మల్ని మితిమీరి తాగమని ప్రమాణం చెయ్యమంటే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో ఆలోచించండి. ఓ సభలో నేనీ మాటే దొరగార్ని అడిగాను. మా హెడ్మాష్టరుగారు నన్ను రెక్కపట్టుకుని అవతలికి లాక్కెళ్లి ఈ దవడా ఆ దవడా వాయించి, 'వెధవా, దొరగారు మాట్లాడుతుంటే వేలెడున్నావో లేవో, ఎదురు సమాధానం చెపుతావా, నీమాత్రం తెలివితేటలు మాకు లేక నోరు మూసుక్కూచున్నామా.' అన్నారు.

ఆ రోజుల్లోనే మనదేశంలోకి బ్రహ్మసమాజం దిగింది. ఎక్కడ, ఎవడి బుర్రలో ఏం పుట్టినా, అది ముందు మనమీదకు రావలసిందే కాదూ! ఈ సామాజికులకు కూడా ఉపన్యాసాలివ్వడం సరదా ఎక్కువగా ఉండేది. వారి ఉపన్యాసాలు వినడానికి బాధగా ఉండేది. ఏమంటే వారు చెప్పేది పూర్తిగా వారికే అవగాహన కాకపోవడం,

 

# బారిష్టరుగారి బాతాఖానీ



ఎదటివాళ్ళ సత్తా తెలుసుకోలేకపోవడం, తాత్త్వికదృష్టి, సమయస్ఫూర్తి లేకపోవడం చేత చెవులో బర్మా తిప్పినట్టుంటేది. ఈ బాధంతా విద్యార్థులకే. ఎవడొచ్చినా మామీదే (అనగా విద్యార్థులమీద) విరుచుకుపడడం. ఓమాటు ఓ తమాషా జరిగింది. నా చదువు పూర్తిఅయి ఇంగ్లండునుంచి తిరిగిన కొత్తరోజులవి. ఎవరో ఒకాయన ఉపన్యాసమిస్తారనీ, నన్ను తప్పకుండా రావలసినదనీ మా పూర్వపు హెడ్మాష్టరుగారు తాఖీదు పంపారు. సరేనని వెళ్ళాను. ఉపన్యాసకుడొక బ్రహ్మసమాజస్థుడు. పాపం ఏమీ చదువుకున్నవాడు కాదు. పొట్టకూటి కిందులో చేరాడు. ఈయనకు నెలకు పదిహేనో ఇరవయ్యో ఇచ్చి ప్రచారకుడుగా చేర్చుకున్నారు. రెండుపన్యాసాలెవరో రాసిచ్చి గ్రామాల్లో తిరిగి కాలక్షేపం చెయ్యమన్నారు. అవి ముఖ్యంగా మద్యపాన నిషేధ ప్రబోధమునకు ఏర్పడ్డవి. మాలపల్లెలలోనూ అక్కడా చెపుతే ఎవ్వడూ వినేవాడు కాదు. అందుచేత స్కూళ్ళల్లో మీటింగులు ఏర్పాటుచేస్తే బాగుంటుందనుకున్నాడు, పాపం. మా పూరూ మా స్కూలూ లోకువగా కనపడ్డాయి ఆయనకి. సరే విద్యార్థులు, మేష్టర్లు, గ్రామంలో నాపోటి పెద్దలు కొందరు అంతా చేరారు. గంటసేపు ఉపన్యాసకుడు ఆయన చిత్తంవచ్చినట్లు, తాడూ బొంగరం లేకుండా, వీరవిహారం చేశాడు. ఉపన్యాసం ముగించే ధోరణేమీ కనపడలేదు. అందరూ బాధపడుతున్నారు. హెడ్మాష్టరుగారు పులిలా అగ్రాసనాధిపతిగా ఉన్నారు. ఏమన్నా అంటే కారేమంటారో అని ప్రాణాలు బిగపట్టుకుని కూర్చున్నారు. ఇది బాగుంది కాదనుకుని నేను లేచి 'అయ్యా ఉపన్యాసం ఇంకా ఏమాత్రం ఉంటుంది, ఇంకా చాలాఉంటే కొంచెం తొందరపనుంది. అది ముగించుకుని మళ్ళీ వస్తాను' అన్నాను. అందరూ సైరెను కూతలాంటి నిట్టూర్పు విడిచారు. హెడ్మాష్టరుగారు నాకేసి తీవ్రంగా చూచినా మందహాసం మట్టుకు చేశారు. ఉపన్యాసకుడు ఉక్కిరి బిక్కిరై, 'అబ్బెబ్బే అయిపోయిందం'డని రెండు నిమిషాల్లో ముగించాడు. ఆ ముగించడంలో ఓ తెలివితక్కువ చేశాడు. మద్యపానాన్ని గురించి మాట్లాడాడని చెప్పాకొదు. ఎదటివాళ్ళు ఎవరో మరచిపోయి, ఇది స్కూలన్న సంగతి మరచి, మాలపల్లె అనుకుని, 'ఓ మద్యపానదురాచార పిశాచగ్రస్తులారా! ఈ దుర్వ్యసనాన్ని మానండి. ఓ మద్యపాన దురాచారపిశాచగ్రస్తులారా! మీకష్టార్జితాన్ని కల్లుకోసం గంగలో కలపకండి. ఓ మద్యపాన దురాచార పిశాచగ్రస్తులారా! అమాయకులైన మీ భార్యాబిడ్డలను మరువకండి' అని మూడు ముక్తాయింపులూ ఇచ్చి కూచున్నాడు. నవ్వాలో ఏడవాలో తెలియక, సభికులు చప్పట్లు కొట్టడం కూడా మరచిపోయారు. అగ్రాసనాధిపతిగారు ఉపన్యాసకులకు కృతజ్ఞత ఎలా తెలపాలో తెలియక బాధపడుతున్నారు. ఈమూర్ఛలో నుంచి ముందు నేను లేచి, 'సోదరులారా, పెద్దమనిషి ఆయన చెప్పాడు. బాగుండదు. వెంటనే తాగుడు మానెయ్యండి. ఆ జీతపు రాళ్ళేవో ఈ నెలాఖరుకేనా తిన్నగా ఇంటికి తీసుకెళ్ళి, కుర్రాళ్ళకు గుడ్డలే కావాలో, ఇంటికేం కావాలో, ఇల్లాలికేం కావాలో కనుక్కొని హాయిగా బ్రతకండి. లేవండి' అన్నాను. ఒక్కసారి అందరూ ఇంజను ఆవిరి విడిచిపెట్టినట్టు గొల్లుమని లేచారు. అగ్రాసనాధిపతిగారు వందన సమర్పణకూడా మరిచిపోయి, తిన్నగా నా దగ్గరకొచ్చి, 'అసాధ్యుడవోయి' అని నవ్వుతూ నా వీపు తట్టారు. మేమంతా బయటకు పెడుతుంటే ఉపన్యాసకుడు అలాగే దిగాలు పడి ఒక్కడూ కుర్చీలో కూచుండి పోయాడు.

ఇంకో మాటు ఇంకో చిత్రం జరిగింది. ప్రతి స్కూల్లోనూ పాత విద్యార్థి సంఘాలూ వాటి వార్షికోత్సవాలూ కొన్నాళ్ళు Fashion. మా స్కూల్లోనూ జరిగే సాంవత్సరికానికి నేనూ వెళ్ళాను. మా పాతకాల పాత విద్యార్థులలో ఒక మహమ్మదీయ సోదరుడుకూడా ఉన్నాడు. ఆయన చాలా తెలివైనవాడు. బాగా చదువుకున్నవాడు. ఆంధ్రంలో మంచి పాండిత్యమున్నవాడు. మంచి వక్త. ఎటొచ్చీ చాలాసేపు మాట్లాడడం ఆయనకు అలవాటు. రానురాను ఆయనకు ముస్లిం లీగుమీద అభిమానం ఎక్కువై ప్రతి సభలోనూ మనవాళ్ళను దూషించడం ఎక్కువయింది. ఆరోజు ఆయన ఉపన్యాసం. గంటపైగా మాట్లాడాడు. ఏదేదో చెప్పాడు. పార్సీలోనో అరబ్బీలోనో హిందువు అంటే దొంగ అని అర్థం గనుక హిందువులంతా దొంగలన్నాడు. ఈ ధోరణిలో ఉపన్యాసం సాగించి, ఆఖరుకు ముగించాడు. నాకు - నాకేమిటి - అందరికీ ఒళ్ళు మండుకొచ్చింది. తరువాత వక్త ఒక డాక్టరు మాట్లాడడానికి వేదికమీద కెళ్ళాడు. నేను లేచి 'అయ్యా! నాదొక మనవి. ఇది వార్షికోత్సవం, పాతవిద్యార్థులు కలుసుకోవడం, కొత్తవాళ్ళు పరిచయం చేసుకోవడం, లాంఛనప్రాయంగా సభ జరపడంకాని దీర్ఘోపన్యాసాలు భరించడం కష్టం. ఇప్పుడు మాట్లాడినవారు చాలా విద్వాంసులు, తమకు తెలిసినదంతా ఇతరులకు చెప్పవలెననే కుతూహలం కలవారు కనుక ఇంతసేపు మాట్లాడారు. ఈ డాక్టరుగారూ తెలివైనవారేను. సమయం దొరికిందికదా అని ఈయన ఏ గైనికొలజీని గురించో ఉపన్యాసం దంచుతే బొత్తిగా భరించలేం. కాబట్టి, సభాపతిగారు ఇక వక్తలకు అయిదునిమిషాలు కంటే ఇవ్వడం ధర్మం కాదన్నాను. సభలో గొల్లుమన్నారు. ఆయనకు కోపం వచ్చి వెళ్ళిపోయారు. ఉపన్యాసాలనే టప్పటికి ఇలాటి వేవో గమ్మత్తులు జరుగుతుంటాయి. గాంధీగారి ఉద్యమం వచ్చిన తరువాత నిజంగా దేశంలో ఉపన్యాసకులు చాలా మంది బయలుదేరారు. చాలా బాగా మాట్లాడేవాళ్లు కూడా బయలుదేరారు. ఎటొచ్చీ మొదటి రోజుల్లో ఎవడెంతసేపు మాట్లాడగలడని పందెములు వేసుకుని మాట్లాడినట్లు మాట్లాడేవారు. ఒకసారి ఒక ఉపన్యాసకుడు సుమారు రెండుగంటలు పైగా మాట్లాడాడు. అప్పటికి సగమేనా కాలేదు. ఏ దేశంలోనో స్వాతంత్ర్య సమరం వర్ణిస్తున్నారు. శత్రువులు రాజప్రాసాదం దగ్గరకు వచ్చారట. లోపలికి ప్రవేశించబోయారట. ఆ ప్రాసాదానికి చాలా మెట్లుఉన్నాయట. ప్రతి మెట్టు దగ్గర ఘోరమైన పోరాటం, కొందరు అక్కడ చనిపోవడం. ఇలా ఒకొక్కమెట్టుదగ్గర యుద్ధం వర్ణించడం. అక్కడ చచ్చినవాళ్ళకోసం ఒక నిమిషం విచారిస్తూ నిలపడడం—ఇలా ముప్ఫై నలభై మెట్లయ్యాయి. ఒక కుర్రవాడు భరించలేక 'ఇంకా యెన్ని మెట్లున్నాయండి' అన్నాడు అమాయకంగా. ఉపన్యాసకుడు వొళ్ళు మండి, జనసమూహాన్ని నాలుగు తిట్టి చక్కా పోయాడు.

(47 వ పేజీ చూడండి)

# ద్రవీభూత తుహినాద్రి

విష్ణు త్రిపాఠీ

పందిట్లో మంగళవాయిద్యాలు మ్రోగుతున్నాయి; ఇందిర హృదయాంతరాళంలో అగ్నిగోళాలు బ్రద్దలౌతున్నాయి. కాబోయే కళ్యాణాన్ని సూచిస్తోంది ఆమె నుదుటిమీద ఎఱ్ఱగా శుభప్రదంగా మెరుస్తూన్న తిలకం! అందరూ ఆనందంలో - సందడిలో మునుగుతూ తేల్తూ వున్నారు. ముహూర్తం త్వరత్వరగా సమీపిస్తోంది. ఇందిరకి మాత్రం యిదంతా భరింపరాని ఆందోళన కలిగిస్తోంది. చిరుకోపం చిందులు త్రొక్కుతోంది మీనాల్లాంటి నేత్రాల్లో. ఎంత వెదికినా ఏ సందూ కన్పించడంలేదు తప్పించుకోడానికి! ఆమెకీ వివాహం సుతరామూ యిష్టంలేదు.

పెరట్లో గుబురుగా పెరిగివున్న సంపెంగ చెట్టు మొదట కూర్చుని కన్నీరు మున్నీరుగా విలపిస్తూన్న ఇందిరను యింట్లోవాళ్లు ఎవరూ అంతవరకూ చూడలేదు. అక్కడికి ఎవరూ రారనే నమ్మకం వుండబట్టే అక్కడ కూర్చుందామె. గయ్యాళీగా వున్న ఆ పెద్ద పెరట్లో అదొక మూలభాగం! దానికితోడు రాత్రి; పంచమి వెన్నెల! సొట్ట నవ్వు నవ్వుతూన్నట్టున్నాడు చంద్రుడు. ఇందిర కది వెక్కిరింపులా వుంది.

జీవితం లోపభూయిష్టమయిన జీవికి ప్రతీదీ వికృతంగానే కన్పిస్తుంది! ఇందిరకి ఏ ఆలోచనా పాలుపోడంలేదు. తెల్లవారితే తా నింకొకరి సొత్తయిపోతుంది. నాలు గ్గంటల నలభైనిమిషాల ప్రభాత సమయానికి ముహూర్తం! ఎలాగైనా యీ పెళ్ళి తప్పిపోతే బావుండును. కాని ఎలా తప్పిపోతుంది?! తప్పించడానికి తనంత తాను చేయగల ప్రయత్నమంతా పెళ్ళిచూపులప్పుడే చేసింది. ఇష్టంలేని సంగతి వ్యక్తం చేసింది.

పెళ్ళిచూపులకి అతనూ యింకో ముసలాయనా వచ్చారు. ఆడంగులెవరూ రాలేదు. ఎందుకూ! అత నొక్కడే చాలు అన్నింటికీ. చూసిరమ్మంటే కాల్చిరాగల సమర్థుడు! రమారమీ ఇరవై అయిదేళ్లుంటాయి. తెల్లగా, పల్చగా, పొడవుగా వున్నాడు. రైల్వే ఉద్యోగస్థుడు. కలకత్తాకు పైని అమృత్సర్‌కు పోయేమార్గంలో ఏదో చిన్న స్టేషనుట అతని వునికి.

అతను ఇంట్లోకి వచ్చే లోపుగానే తనకి ముస్తాబుచేసి వీధి గదిలో కూర్చోబెట్టారు. ఏం చేస్తుంది మరి?! తల వొంచుకూర్చుంది గుండె దిట్టం చేసుకుని.

అత నొచ్చాడు. కాని అందరు పెళ్ళికొడుకుల్లాగా లే డతను. చాలా విడ్డూరం మనిషిలా వున్నాడు. సిగ్గూ బిడియం లేదు. అతనికేం, మొగాడు! అందులోనూ ఆధునిక యువకుడు. కాస్త కవిత్వం కూడా వచ్చునేమో!

'ఈ అమ్మాయేనా నా కాబోయే యోషామణి?' అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

ఎదురుగా చాపమీద కూర్చున్న తనకు చెవిలో శూలం పెట్టి పొడిచినట్టయింది. నాన్న నవ్వుతూ 'ఔ'నన్నట్టు తల వూగించాడు. అమ్మ రెండు కప్పులతో కాఫీ తెచ్చి టేబుల్ మీద వుంచింది. ముసలాయన వొద్దన్నాడు.

అతను మాత్రం మొహమాట పడలేదు. కనీసం గొప్పకయినా ఒద్దనలేదు. హోటల్లో పైకం చెల్లించినవాడిలా ధీమాగా తీసుకున్నాడు. ఇదంతా కలుపుగోరుతనమని అతని అభిప్రాయం కాబోలు!




భారత రిపబ్లిక్ ప్రథమ రాష్ట్రపతి

**బాబు రాజేంద్రప్రసాద్**




సోషలిస్టు వ్యవస్థ స్థాపనకు దీక్షవహించిన జవహర్‌లాల్ నెహ్రూ

# ★ ద్రవీభూత తుహినాద్రి ★

'అమ్మాయి పేరు?' అన్నాడు.

'ఇందిర.' నాన్నే జవాబిచ్చాడు.

మందహాసం చేశాడతను. ముసలాయన కూడా 'బాగుం' దన్నట్టు తల వూగించాడు.

'పాటలొచ్చునా?' అన్నాడు.

'ఉహుం. సంగీతం చెప్పించలేదు.' అన్నాడు నాన్న.

'ఈమాట వినగానే తోకముడిచి వెన్ను చూపిస్తా డనుకుంది. కాని అతనెక్కడ! వేలుచూపితే మండ్రిమింగే రకంలా ఉన్నాడు ఇక అప్పుడే అనుకుంది; అత నెలాగూ తన కంఠానికి వుస్తెకట్టక తప్పదని! అందుకు తగ్గట్టూవుంది అతని జవాబు.

'దానికేమిటి లెండి. నాకోటి వొచ్చును గనకనా ఆమె నడగటానికి. కాకపోయినా యీ రోజుల్లో ఆమాత్రం సినిమా పాటలైనా పాడనివాళ్ళుండరు.' అన్నాడు.

నాన్న యీ మాటతో పొంగిపోయాడు.

'ఎంతవరకూ చదువుకుందమ్మాయి?'

'ఏదో థర్డ్‌ఫారం వరకే చదివించాం?' అన్నాడు నాన్న.

అతనికి చదువుకున్న పిల్ల కావాలి కాబోలు; అని నాన్న భయం. తనకూ అదే నమ్మకం. కాని అతనుమాత్రం నాన్న అభిప్రాయానికీ తన ఆశయానికీ వ్యతిరేకిగానే వున్నాడు.

'మంచిపని చేశారు. ఏదో లౌకిక జ్ఞానానికి ఆ మాత్రం చదువు చాలు. పెద్దచదువు చదివిస్తే దానివల్ల కలిగే లాభంకంటే నష్టం ఎక్కువ.' అని ఖండించాడు.

నాన్న అతని మాటలువిని ఆశ్చర్యపోయా డనటానికి సందేహంలేదు. అందుక్కారణం యింతకుముందు తనని చూడానికొచ్చిన యిద్దరు, ముగ్గరు పెళ్ళికొడుకులూను. వాళ్ళే! ఎన్ని హిరణ్యాక్ష వరాలు కోరలేదు వాళ్ళు! తలకుమించిన టెక్కు చేశారు. అంతేకాని యితనిలా చనువుగా యింట్లో వాళ్ళలా అంతర్యం విప్పి చెప్పారావాళ్ళు?! అందుకే యితన్నిచూస్తే నాన్న కెంతో గౌరవం! కాని తనకో, పరమ అసహ్యం! ఎక్కడి కక్కడే 'గంగిరెద్దులా తలూపుతున్నాడు.

నాన్న వెనుకగా గోడకానుకుని నించున్న అమ్మ ఆరంభించింది:

'మాడు నాయనా! సంసారిపిల్లకి చదువెందుకు అని వాళ్ల నాన్న ఒకటే మొండివాదన! అందుకు తగ్గట్టూ దానికీ చదువు మీద అట్టే ధ్యాస లేదు. అల్లికలూ కుట్లూ కొద్దిగా నేర్చుకుంది. వంటపనుల్లో మాత్రం బాగా ఆరితేరిందని చెప్పొచ్చు. వాళ్ళ నాన్నకు దాని వంటే ఎక్కువ రుచి.'

అమ్మ యింకా ఏమో చెప్పబోయింది. మధ్యలోనే అత నందుకున్నాడు.

'అంతకన్నా కావల్సిం దేముందమ్మా! సంసారిపిల్ల కుండవలసిన లక్షణాలన్నీ అమ్మాయిలో మూర్తీభవించి వున్నాయి. నేను వాంఛించేదీ అదే. ఇప్పటి కప్పుడే రెండేళ్లు కావస్తోంది; ఒంటిగా హోటలు మెతుకులు కతకలేక ఛస్తున్నాను. కమ్మగా వంటచేసి పెట్టే అమ్మాయి కావాలిప్పుడు. అంతేకాని రీవిగా ముస్తాబయి నాట్యాలు చేసే నర్తకి నాకెందుకు!' అన్నాడు.

నాన్న లోపల్లోపలే వుబ్బిపోతున్నాడు. అతను నిర్లక్ష్యంగా నవ్వి వూరుకున్నాడు. తన కంతకంతకూ శరీరం వుడికిపోతోంది. అమ్మ వెనుకనుంచే అన్నది:

'పిల్లా! మొహం కాస్త పైకెత్తు' అని.

అంతవరకూ తా నతన్ని చూడలేదు. వాక్చమత్కృతులు మాత్రం వింటోంది. అతను చూశాడు తన మొహం.

'పక్' అని అసహ్యించుకుంటూ డనుకుంది తను. ఇంతసేపై తల వొంచుకూర్చుని సాధించి ప్రదర్శించిన మెల్లకన్ను ఆమాత్రం పని చెయ్యకపోదనుకున్నది.

అతను మరింత పరీక్షగా చూసి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. తన కప్పుడే గుండెలు జారిపోయాయి. తననుకున్నంత పనీ చేశాడతను.

'అమ్మాయి కళ్లు...' అన్నాడు.

అమ్మ నాన్నా కొయ్యబారిపోయారు. నిక్షేపంలాంటి కళ్లు. కళ్లూ అని మూడు చుక్కలు పెడతాడేమిటే అనుకుంది అమ్మ. నాన్న యీ తంత్రం గ్రహించే వుంటాడు. లోపలఅగ్ని రగుల్కొనివుంటుంది. అందుకే మౌనం వహించాడు. తన కింక చివాట్లు ఎలాగూ తప్పవు!

అమ్మ, నాన్నా ఒకరిమొఖా లొకళ్లు చూసుకున్నారు.

'అమ్మాయి...కళ్ళు...వాటి కేం' అన్నాడు నాన్న తడబడుతూ.

అతనీసారి లోపల్లోపలే నవ్వుకున్నాడు. అత నెన్నిచూశాడ్లో యిలాంటివి. తను యధాప్రకారం తలదించుకూర్చుంది.

అతనే చొరవగా మళ్ళీ అన్నాడు: 'నే నొక్కమాట చెప్తాను వినండి. ప్రతీ మనిషికీ ఏదో ఒక లోపం వుంటూనే వుంటుంది. లోపం లేకపోతే ఆ మనిషి నూటికి నూరుపాళ్లూ దేవుడై వుండాలి అంటాను నేను. ఇంతకూ గుణం ప్రధానం. ఆమెకేం! అదృష్టవంతురాలు. చిరుమెల్లగల వాళ్ళు సిరిసంపదలు పొందుతారు...మరి మేం వెళ్లొస్తాం' అన్నాడు.

నాన్న మెల్లగా నిట్టూర్చాడు. ముసలాయనా అతనూ లేచి నించున్నారు. నాన్నకూడా వాళ్లని సాగనంపటానికి బయల్దేరాడు. అతను గుమ్మం దాటుతూ మరోసారి వెనక్కు తిరిగిచూశాడు.

వాళ్ళా గుమ్మం దాటగానే అమ్మ తన గూబలు సాగదీసింది. నానా తిట్లూ తిట్టింది. 'కడుపు చెడబుట్టావు' అన్నది. 'ప్రతీ సంబంధం యిలా తేలగొడితే చివరికి చిప్ప పుచ్చుకుని తిరిపెమెత్తుకోవాల్సిందే తెలుసా! ఇంకా ఆ చంద్రమౌళిగాడికోసమే ఛస్తున్నావన్నమాట! ఇంటికి నీవల్లే శని చుట్టుకుంది. మెల్లకన్ను పెడుతుందిట, మెల్లకన్ను!! మీ నాన్న రానీ. ముందున్నాది ముసుళ్ళపండుగ' అంటూ ఏకధాటీని ధూం ధాం చేసింది.

తను మాత్రం ఏంచేయగలదు? తప్పుపనే చేసింది. మరి తన జీవితాని కిది అగ్నిగుండం అవబోతూ వుంటే జ్వాలల్నించి తను రక్షించుకోవద్దూ!

చంద్రమౌళిని ఇందిర గాఢంగా ప్రేమించింది...చంద్రమౌళికీ ఇందిరకూ ఏ విధమైన బాంధవ్యమూ లేకపోయినా ఒక శాఖవాళ్లు కావడం, యిరుగు పొరుగిళ్ళలో నివసిం

# మీ ముఖమును మృదువుగ, మనోహరముగ, నవనవలాడేలా ఉంచుకొనుట ఎంతో సులభము!

## మీ చర్మమునకు పాండ్స్ సౌందర్య రక్షణ యివ్వండి

ప్రసిద్ధిగాంచిన పాండ్స్ క్రీములు మీ చర్మమునకు అత్యుత్తమమైనవి; మీ పరిసరాల శీతోష్ణస్థితుల బాధలనుండి దానిని కాపాడును. ప్రపంచమంతటా సౌందర్యవతులవలె మీరూ ఈ క్రీముల సౌమ్యరక్షణతో మీ ముఖమును నవవికసిత పుష్పమువలె ఉంచుకొనగలరు.




వాడిగాలిగల శీతోష్ణస్థితి మీ ముఖ కాంతిని పాడుచేస్తే—పాండ్స్ కోల్డ్ క్రీమ్ మీకు అవసరము. దానిలో నున్న విశేష నూనెలు చర్మమునకు ఉపశమనము నిచ్చి తీక్షణమైన ఎండ, వడగాడ్పులతో అది వాడిపోకుండా కాపాడును.




మీ చర్మము సహజముగ జిడ్డుగా యుంటే లేక వేడి తెమ్మగల గాలితో జిడ్డుగా అవుతూ ఉంటే—పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి. ఎంతో తేలికగా మరియు మంచువలెనున్న ఈ క్రీమ్ రోమరంధ్రాలను అడ్డిన జిగటను, విస్తీర్ణమైన రక్త కణాలను అడ్డము తీసి, మీ ముఖమునకు సౌమ్య రక్షణ యిచ్చును.

## ప్రపంచములో సౌందర్యరాణులు వాడే క్రీములు

పాండ్స్ క్రీములను ప్రతిదినము తప్పక వాడి మీ చర్మములో వ్యత్యాసము చూడండి — కొన్ని రోజులలో మీ ముఖము ఎంతో నిర్మలముగ, మృదువుగ ఉండుట మీరు చూడగలరు...

# పాండ్స

కోల్డ్ క్రీమ్

వ్యానిషింగ్ క్రీమ్



# ★ ద్రవీభూత తుహినాద్రి ★

చడం మూలాన మొదట్లో పుట్టిన అభిమానం క్రమంగా ప్రేమ ప్రణయంక్రింద మారింది. చంద్రమౌళి పొరుగింట్లో ప్రవేశించడం ఇందిరలో యవ్వనం ప్రవేశించడం రెండూ ఒకేకాలంలో జరిగాయి. ఆ సంవత్సరమే చంద్రమౌళి స్కూల్ ఫైనల్ పరీక్ష ప్యాసయ్యాడు. చురుకైన యువకుడు; అందగాడనే చెప్పొచ్చు. అతని తల్లీ అప్పచెల్లెలూ కూడా తరచూ ఇందిర యింటికి వొస్తూండేవారు. ఈమెకూడా వెళ్తుండేది. రాకపోకలు అన్యోన్యంగా జరుగుతుండేవి. చంద్రమౌళి హృదయం ఇందిరమీద లగ్నమయింది. ఆమె అటొచ్చినా యిటొచ్చినా ఆశగా చూస్తుండేవాడు. చిరునవ్వులు చిగిరించేవాడు. పాటలు పాడేవాడు. ఇందిర కనిపెడుతూనే వుండేది అతని ప్రవర్తన. ఆమెక్కూడా ఆనందంగానే వుండేది.

పెరట్లో అరటిచెట్లదగ్గర నుంచుని పాటలు పాడేవాడు. ఏం, యింకోచోట పాడుకోరాదూ? అక్కడే పాడాలా? ఆమె పూజకోసమనే నెపం పెట్టి పూవులు కోయడానికి వెళ్లేది. కొమ్మలన్నీ జలజలా కదిపి అలికిడి చేసేది. పిట్టగోడకు అటువైపు చంద్రమౌళి, యిటు ఇందిర. గుబురైన చెట్లచాటు. ఇలా కొంతకాలం గడిచింది.

ఇందిరకూడా యీ రహస్యాన్ని బయటికి చిందనీయలేదు. హృదయ కుహరంలోనే గుప్తం చేసుకుంది. ఓనాటి సాయంకాలం కోనేటికి వెళ్ళివస్తోందామె. చంద్రమౌళి ఎదురయ్యాడు. అదృష్టవశాత్తూ దారిలో మరెవ్వరూ లేరు.

'ఇందిరా!' అన్నాడు.

మంత్రంతో కట్టిన పాములా తక్కున ఆగిపోయింది ఇందిర.

'నేను నీకోమాట చెప్పాలనుకుంటున్నా' అన్నాడు.

'సరే. చెప్పండి' అంది ఇందిర నవ్వుతూ.

'నేను...నిన్ను ప్రేమించా నిందిరా!' అన్నాడు.

ఇందిర అమాయకంగా అతని కళ్లల్లోకి చూసింది.

'ఏం? నీ కింకా నమ్మకం లేదా?'

'లేకేం. గట్టి నమ్మకముంది.' అ, చిలిపిగా అన్నాది.

'ఏం? ఇష్టం లేదా?'

'లేకేం!' మీ యిష్టం కోసం నేను; నాకోసం మీరు ఎదురుచూస్తున్నాం. మరి నే వెళ్ళొచ్చా.' భీతాహంగా యిటు అటూ చూసింది ఇందిర.

'నేను ధన్యుణ్ని ఇందిరా! నువ్వింక వెళ్లు.'

నాటినుంచీ నిత్యం ఎక్కడో ఒకచోట యిద్దరూ కలుసుకుని సరదాగా మాట్లాడుకునేవారు. ఓనాడు చంద్రమౌళి అన్నాడు:

'ఇందిరా! ఎన్నాళ్లిలా దోబూచుల్తో కాలం గడపడం? మనిద్దరం దంపతులం కావాలి.'

'కాని...' నసిగింది ఇందిర.

'ఏం? నసుగుతున్నావ్. ఇందిరా! నీ తత్వం నాకు బాగా తెలుసు. మీనాన్నా, అమ్మా యిష్టపడాలనికదూ నీ వూహ. వాళ్ల అంగీకారం మీదనే జరుగుతుందిలే.

'అదే అనుమానంగా వుంది.'

'ఏం మీ నాన్న అంగీకరించడా? పోనీ అడిగి చూద్దాం.' అన్నాడతను.

'అయితే అడగండి...కాని అడిగేముందు నా కోరిక ఒకటి వినండి. ఒకవేళ మా నాన్న ఉద్రేకంలో ఏమైనా అంటే మీరేమీ అనుకోరుగదా?'

'అనుకోడాని కేముంది!? మాట దక్కించుకో లేకపోయాడు అనుకుంటాను. అంత మాత్రంచేత మనపెళ్లి ఆగిపోతుందా? కాని నువ్వుకూడా నాకో వాగ్దానం చెయ్యాలి ఇందిరా! మీ అమ్మ నాన్నా మన పెళ్లికి వ్యతిరేకిస్తారనుకో. అప్పుడు మనంతట మనమే స్వతంత్రించి చేసుకోవాలి. ఏమంటావ్?' అన్నాడతను.

ఇందిర అంగీకారం తెలియజేస్తూ తల వూగించింది.

చంద్రమౌళి తెగించాడు. లేకపోతే ఎన్నాళ్లు తెరచాటు నాటకం. వయోవృద్ధుడైన ఒక దూరపుబంధువుని ప్రోత్సహించి పంపాడు. ఆ పెద్దమనిషి కూడా సామాన్యుడు కాడు. మంచి వక్త. అన్ని విషయాలూ అతినేర్పుగా ఇందిర తండ్రికి వ్యక్తం చేశాడు. కోరి చేసుకుంటానంటే కులం తక్కువనకూడదని కూడా చెప్పాడు. కాని ఇందిర తండ్రికి యీ వ్యవహారం ఏమీ నచ్చలేదు. పైగా ఇందిరమీద అతనికో దురభిప్రాయం కూడా ఏర్పడింది. తన సనాతన ఆచారాలకు యిది వ్యతిరేకం అనుకున్నాడు.

'ఇప్పట్లో అమ్మాయి పెళ్లి చేయదల్చుకోలేదు.' ఒక్కమాట మాత్రం అని వూరుకున్నాడు. ఆతరవాత భార్యకీ విషయం తెలియబరిచాడు. ఆమె మరీ మండిపడ్డది. 'ఉద్యోగం సద్యోగం లేనివాడికి పిల్లనిచ్చి మేమేం సుఖపడాలి. అడగడానికైనా సిగ్గుండొద్దూ. పరిచయమున్నంత మాత్రాన పడుచుపిల్ల కనిపిస్తే పెళ్లిచేసుకుంటానని తయారవడం ఏం సబబుగా వుంది చెప్పండి ఒదినగారూ!' అంటూ ఇరుగుపొరుగుల వాళ్ళతో చెప్పి దులిపి దుల్లికొట్టింది.

ఇందిర తన ఎముకలు ఒక్కొక్కటే విరగ్గొట్టినట్టు బాధపడింది. చంద్రమౌళికీ విషయం తెలిసి, చాటుగా ఆమెను కలుసుకుని చెప్పాడతను.

'ఇందిరా! మీ అమ్మగారు చెప్పిందాంట్లో కూడా కొంత నిజం లేకపోలేదు. మీ వాళ్లెలాగూ మన పెళ్లికి యిష్టపడరు. కాని వాళ్లని ధిక్కరించి స్వతంత్రంగా బ్రతకడానికి మనకూ రెండు కాళ్ళూ నిలవగల స్థానం ఒకటుండాలి. అందుకే ఉద్యోగనిమిత్తం రేపుదయం నేను కలకత్తా వెళ్తున్నాను.'

'వొద్దు...నాకు భయంగా వుంది' అంది ఇందిర.

'మరెం భయం లే దిందిరా! దేవుడు మన కనుకూలిస్తాడు. నువ్వు ధైర్యంగా వుండు' అని చెప్పి మర్నాటి వుదయం వెళ్లిపోయాడతను.

ఇదే అదననుకొని అమ్మా, నాన్నా ఇందిరకు సంబంధాలు వెతకడం ప్రారంభించేరు. కంఠానికి కత్తులు కట్టినట్టు బాధపడిందామె.

రెండు సంబంధాలు సునాయాసంగా తప్పిపోయాయి. ఇప్పుడీ మూడోది మాత్రం తప్పేట్టులేదు. కోరకరాని కొయ్యవరుడు! తన జీవితాన్ని భస్మం చేయడానికి కంకణం కట్టుకున్నాడు.

నాన్న నవ్వుమొహంతో తిరిగొచ్చాడు.

'ఒసేవ్! దేవుడు పూర్తిగా మనవాడే నే.' అంటూ మంచంమీద కూలబడ్డాడు. అమ్మ ఆశగా పరుగెత్తింది. మాట్లాడబోతూన్న నాన్నని ఆపుచేసింది. తను వినకూడదని కాబోలు! 'అంట్లు తోల్పుకురా.' అని కసిరింది. తనేం చంటిపిల్ల గనకనా! ఆమాత్రం తెలీదూ! అమ్మా నాన్నా గదిలో మాట్లాడుకుంటూంటే పెరట్లోకి వెళ్తూన్నట్టే నటించి గోడచాటున పొంచుని విన్నది.

నాన్న అంటున్నాడు– 'అతను మనపట్ల అమృతమూర్తి సుమా! నా మంచితనంచూసి, అతను మంచివాడు కావడం మూలాన ఎలాగో వొప్పుకున్నాడు. లేకుంటే యిది తేలిపోను.'

ఈ మాటతో అమ్మ కొస్త చల్లబడింది. తనకుమాత్రం వొళ్ళు తెలీటంలేగు. ఆ స్థితిలోనే మరి నాలుగు మాటలుకూడా చెవిలో ప్రవేశించాయి. పసుపూ కుంకం క్రింద ఆరొందల రూపాయలు యివ్వాలనీ వారంరోజుల్లోనే ముహూర్తం కుదర్చాలనీ నాన్న అన్నాడు.

శుభస్య శీఘ్రం అంది అమ్మ

తనకి ఆ రోజునించీ కంటిమీద కునుకులేదు చంద్రమౌళి కుటుంబం పక్కింట్లోంచి బస మార్చేశారు. చంద్రమౌళికి తను చేసిన వాగ్దానం! - విచారంతో జీర్ణించిపోతోంది ఇందిర. అక్కడికీ ధైర్యం చేసి చంద్రమౌళిని తప్ప యింకొకర్ని చేసుకోనని చెప్పింది. దాని ఫలితం మరి నాలుగు తిట్లూ దీవెనలూను! తన్ని లక్ష్యపెట్టేవాళ్ళెవరు?

నాన్న వరుడికి ఆరొందలూ అడ్వాన్సు యిచ్చాడు. ముహూర్తం నిశ్చయమైంది. తెల్లవారితే అతను తనమీద సర్వహక్కులూ వున్నట్టు ప్రవర్తిస్తాడు. పెళ్ళివారంతా విడిదిలో సందడిచేస్తున్నారు. తన కీ ప్రపంచంలోనే వున్నట్టులేదు. చంద్రమౌళికి ఏమిటి సమాధానం? ఇప్పుడు తన కర్తవ్యం? ఈ ఆలోచనల్లో ఇందిర మనసు వికలమయింది. కట్టుకున్న కొత్త జరీచీర సగంపైగా తడిసి ముద్దయింది

'తెల్లవారకపోయినా బావుండును!' అనుకున్నది అమాయకంగా.

'పిచ్చిదానా! ఎందుకా భ్రమ!' అన్నట్టు చంద్రుడింకా వికటంగా నవ్వుతూ ఘనపథంలో ముందుకు సాగిపోతున్నాడు. ఏదో దాపుల అలికిడి విని త్రుళ్ళిపడి చుట్టూ చూసింది. అతనే! - వరుడు! - ఎదురుగా నించున్నాడు.

'ఇందిరా!' అన్నాడు.

ఇందిరకు కరచరణాలు ఆడలేదు. చెమటకు మరింత అంటుకుపోయింది. 'ఎందుకు?' అన్నది భయంగా.

'నే నెవర్నో తెలుసు కదూ?'

'ఆఁ. తెలీకేం. మాంగళ్యంతో నా కంఠం వుత్తరించబోతూన్న హంతకులు' అన్నది.

అతను నవ్వేడు; పూర్వంలాగే! ఇందిర కళ్ళల్లో నిప్పులు కురిశాయి. హృదయంలో కుతకుతావుడికే దుఃఖం పైకుబికింది.

'మీది హృదయం కాదు. గండశిల' అన్నది.

'కాదు. ద్రవీభూత తుహినాద్రి' అన్నాడతను.

'మీ రిక్కడికి ఎందుకొచ్చినట్టు? ఏడ్చే నన్ను మరింత ఏడ్పించడానికా?' ఇందిర వలవలా ఏడ్చింది.

'అదే పెద్దపొరపాటు' అన్నాడతను.

'పొరపాటు! నాదికాదు. దేవుడిది. నన్ను పుట్టించడం!'

'ఛా! అలా ఏడవకండరా! నేను నీ శ్రేయోభిలాషిని.'

'శ్రేయోభిలాషి. ఇంకా నన్ను వంచించాలని మాస్తున్నారా? నా శ్రేయస్సు కోరే మాటంటే నన్నెందుకు నచ్చుకున్నారు మీరు?'

'నేను నిన్ను నచ్చుకోలేదే' అంటూ క్రిందని కూర్చున్నాడతను

'మరెలా పెళ్ళి చేసుకోడానికి సిద్ధమయ్యారు?'

'నీ శ్రేయస్సుకోసం. ఎందుకిందిరా! నీకీ వివాహం యిష్టం లేదన్న సంగతి నాకు మొదటే తెలుసు. మనిద్దరికీ పెళ్ళి జరగడం పచ్చి అబద్ధం.'

'నన్నేం గేలిచేయకండి. నా మనసు బాగులేదిప్పుడు.'

'గేలి కాదిది. నిజంగానే చెబుతున్నా. శ్రద్ధగా విను.' అన్నాడతను. ఇందిర ఆశ్చర్యపోయింది. ఏమిటీ విడ్డూరం అనుకుంది. అతనెలాగూ విడ్డూరం మనిషే మరి!

'క్షమించండి. ఉద్రేకంలో ఏమన్నానో' అంటూ కళ్ళు తుడుచుకుని అతని ముఖంలోకి చూసింది అతను ఆరంభించాడు:

'చంద్రమౌళి నా ప్రాణమిత్రుడు. మిత్రధర్మం నెరవేర్చుకుందామని నేనీ నాటకమాడుతున్నాను. కలకత్తాలో చంద్రమౌళికిప్పుడు ఓ పని సిద్ధంగా వుంది. ఐదొందలు డిపాజిటు కడితే ఉద్యోగం వస్తుంది.'

'అందుకని...?'

'మరేమీ గాభరాపడకు. దీనితోపాటే ఎల్లుండి మీ యిద్దరి పెళ్ళి దివ్యంగా జరిపించటానికి ఏర్పాట్లయ్యాయి.'

'అయితే యీ వ్యవహారమంతా...?'

'కేవలం బూటకం.'

'ఆ ముసలాయ నెవరు మరి?'

'హాతిక్షేళ్ళ పశుచు.'

'ఏమో! నాకంతా అయోమయంగావుంది.'

(55-వ పేజీ చూడండి)




(గతసంచిక తరువాయి)

## 5

తెనాలిలో శేషాద్రిరావుగారు మంచి రాబడిగల ప్లీడరు. ఆయన రెండంతస్తులమేడ కట్టించాడు. బాగా ఊబకండలు పెరిగిన స్థూలకాయం. దాన్ని చాలా కష్టంతో మోస్తూ, కోర్టులోనూ ఇంట్లోనూ ఆయాసపడుతూ తిరుగుతూవుంటాడు. మిగతా ప్లీడర్లూ, ప్లీడరుగుమాస్తాలూ, వాదులూ ప్రతివాదులూ బొండుప్లీడరు అంటూ నవ్వుకోడం కద్దు. అయితే ఆయన్లో విశేషం ఏమిటంటే, ధర్మంవేపో, అధర్మంవేపో ఆయన ఏవేపు వాదించితే ఆవైపు గెలుపు గ్యారంటీ. బోలెడంత సంపాయించాడు; పెట్టుబళ్ళుపెట్టి దావాలు గెలిపించి, ఎయా ఆస్తులలో భాగాలు పుచ్చుకున్నాడు. కుక్కను అమ్మిన డబ్బు మొరుగుతుందా అన్నట్టు, సంపాదించిన డబ్బు పెరిగి పేరుకుంటోంది. ఆయనకి తన దావాలూ వ్యవహారాలూ తప్ప ఇంక ఏ విషయాలూ పట్టవు. బయట ప్రపంచం యుద్ధాలలో మునిగివున్నా, దేశం స్వాతంత్ర్యంకోసం పోరాడి చావుబతుకుల్లో మునిగిఉన్నా. ఆయన దేన్నీ పట్టించుకోలేదు. ఆయనకి రాజకీయాలు చేదు—సాంఘిక వ్యవహారాలంటె విషప్రాయం; తన ఇనప్పెట్టెలో కట్టలకి కట్టలు పడివున్న డబ్బు లెఖ్ఖచూసుకుంటూ, వేళకి బకాసురుడిలాగా తింటూ, చక్కగా ఆయాసపడుతూ సదా చిరునవ్వుతో తొణికిసలాడుతున్న వర్చస్సుతో, వాదుల ప్రతివాదుల రక్తనాళాల్లోని ద్రవాన్ని రకరకాల ఫీజులపేర పీలుస్తూ, జలగలా సుఖజీవనం చేస్తున్నాడు.

ఆయన ఇంటిలో ఆధునిక సౌకర్యాలు అన్నీ ఉన్నాయి. వితంతువైన ఓ కూతురూ, ఆమెకంటే చిన్నవాడైన కొడుకు ఒకడూ వున్నారు. ప్లీడరుగారి భార్య ఆయన మనస్తత్వానికి సరిపోయిన ఇల్లాలు. మొగుడు, కడుపుకేనా తింటాడు నిస్సంకోచంగా. ఆమె తిననుగూడా తినదు, ఎవరేనా తింటే సహించదు. ఆమె పేరు జానకమ్మ. కూతురు రమణమ్మ, తల్లికి సరిగ్గా వ్యతిరేకం; ఆమెకి ఇంట్లో ఇతరులకి, ఏ విషయంలోనూ అభిప్రాయాలు కలవవు. అయినా ఆమె ఏమీ చెయ్యగలిగింది లేదు; ప్లీడరుగారి పరపతీ, తల్లి నోరూ, తమ్ముడి తెలివితక్కువతనపు చేష్టలూ ఆమెని అనేకరకాల అణిచేశాయి. ఆమె నిత్యం రుసరుసలాడుతూ, తన లోకంలో తాను బతుకుతూ, కాలం వెళ్ళబోసుకుంటోంది.

ప్లీడరుగారు, ఆవేళ ఉదయం, ఫలహారాలదగ్గిర కూచుని ఉన్నాడు. భార్య జానకమ్మ వడ్డిస్తోంది. ఓ అర డజన్ ఇడ్డెన్లు తిని, మూడు అరకప్పుల కాఫీ సేవించి, రెండు కిళ్ళీలు జమిలిగా నమిలితే గాని తృప్తిపడ్డని తెలుసుగనక ఆమె, ఇటు ఏ దృష్టిదోషమేనా తగుల్తుందేమో అని—రెండేసిగా ఇడ్డెన్లు ఆరు తడవలు వడ్డించింది. కాఫీ మూడు తడవలు వెండిగ్లాసులో పోసింది. పనిచేసేమనిషి రెండు కిళ్ళీలూ తెచ్చింది. ప్లీడరుగారు, చుట్ట బీడీలు తాగే మనిషి గాదు. కిళ్ళీలు నోట్లో వేసుకుని పిండి రుబ్బుతున్నట్టు నములుతూ, "అబ్బాయి ఏడీ?" అని భార్యని ప్రశ్నించాడు.

"ఏడేగదండీ అయిందీ, ఇంకా లేవలేదు గాబోలు" అంది జానకమ్మ.

శేషాద్రిరావుగారు, తమ్మ తుపుక్కున వరండా అవతలకి ఉమ్మేసి, "నారింజరసం తీసి, అమ్మాయి చేతికిచ్చి ఆఫీసురూంకి పంపించు. అబ్బాయి లేచాక, నాకు కనపడమని చెప్పు" అంటూ నిదానంగా తన ఊబకాయాన్ని లేవదీసి, ఆయాసంగా రొప్పుతో, ఆఫీసురూంకి వెళ్లాడు. ప్లీడరుగారికి స్నానం జపాలతో నిమిత్తం లేదు.

ఆయన నిష్క్రమించగానే జానకమ్మ లోపల ఇడ్డెన్లు వండుతూన్న కూతుర్ని కేకేసి, "అమ్మాయి, నాన్నకి నారింజరసం తీశావా?" అని అడిగింది.

"నాకేం నాలుగు చేతు లున్నాయా; అన్ని పన్లూ ఒకేసారి చక్కబెట్టడానికి? నువ్వు వొచ్చి రసం తియ్యి. నే నిచ్చివస్తా" అంది, కూతురు నొసటపట్టిన చెమట చీరెకొంగుతో తుడుచుకుంటూ, కొంచెం విసురుగా.

"అబ్బ - నీ ఇల్లు బంగారంగానూ! అడవకే. నేనే తీస్తా లేవే" అంటూ జానకమ్మగారే, అమె నారింజకాయలు జాగ్రత్తగా కోసి రసం తియ్యసాగింది.

పొయ్యి పొద్దుట్నించీ సరిగ్గా మండక పొగలు రేగుతూ ఏడిపిస్తూండడంవల్ల, రమణమ్మ బాగా విసిగివున్నది. గొట్టంతో పొయ్యి వూదుతూ, "ఈ తడిపేళ్లు తగలబెట్టకపోతే కొంచెం ఎండువి చూసిపెట్టాగూడదుటే అమ్మా" అంది, ఎర్రబడ్డ కళ్లనించి కారుతున్న నీళ్లు తుడుచుకుంటూ.

"ఎవర్నడుగుతావే? అబ్బాయే వెళ్లాడు మొన్నటి తడవ. బేరంచేసి పట్టుకురా, అని నాన్నగారు చెప్పారు గాబోలు. ధర తక్కువ అని ఈ పేళ్లు పట్టించుకొచ్చాడు" అంది తల్లి, పెద్ద వెండి గ్లాసులో నారింజరసం, గింజలు పడకుండా జాగ్రత్తగా పోస్తూ.

రమణమ్మ, మెటికలు విరుస్తూ, "ఈ వాజమ్మ తెచ్చిందీ?...సరే. ఇంకేం బాగుపడ్డట్టే" అంది కోపంగా, కసిగా.

తల్లి తలెత్తి రుసరుసలాడుతూ చూసింది కూతురువేపు, కాని ఏమీ అనలేకపోయింది.

(46 వ పేజీ చూడండి)




(గత సంచిక తరువాయి)

## 11

శ్రీనివాసరావుగారింత ఖచ్చితంగా చెప్పతారనేది సుగుణభూషణుడికి యేనాటినించో అనుభవమే. తనిప్పుడు తేల్చుకోవలసినది తండ్రికీ తనకూ మధ్యవున్న అభిప్రాయాల పరిష్కారం మాత్రమే కాదు. ఆ స్థాయిని అధిగమించి యెప్పుడో బయటపడ్డాడు.

తనలో రేకెత్తిన భావుకతాతిశయాన్ని ఆధారంగా గొని యెదటివ్యక్తి మనస్తత్వం యెలాంటిదో వ్యాఖ్యానించుకోవాలి. ఇందులో ఆవేశాలు, కావేషాలు అసలు పనికిరావు. హృదయం చీల్చుకువచ్చిన యీ నిర్ణయంద్వారానే తననుగురించి తల్లకొకవిధంగా అనుకొనేవారికి తిరుగులేని సమాధానం చెప్పగలడు. తనింతవరకూ కర్తవ్యతాజ్ఞానం కొరవడినట్లే కురిపరివిధాల వూహించుకోసాగాడు. కేవలం అది తన బలహీనత మాత్రమే కాదు; భావాల బరువుతో కొంత ఉక్కిరి బిక్కిరి అవుతూ వుండడం హృదయంగల ప్రతివాడికీ సహజమే అయినా, వాటి ఒత్తిడినించి తట్టుకుని సాఫీగా అయిన నిర్ణయాలు చేసుకోవడంలోనే తన ప్రజ్ఞ యిమిడివున్నదేమో...తను చేసుకొన్న నిర్ణయం తిరుగులేనిది కావాలి, పొరపొచ్చాలు అవకాశంగా తీసుకుని వొకరిచేత ఆక్షేపింపబడదగినదిగా వుండకూడదు. జీవితాంతం దానికి కట్టుబడి వుండదగినదిగా రూపొందాలి.

దీనిమూలాన అసలు జీవితం అంటే యేమిటో చవిచూడగలుగుతాడు తను. ఇన్నాళ్లూ తన అనుభవానికిరాని యేదో వొక అవ్యక్త అవస్థాంతరంలోకి అడుగు పెట్టబోతున్నాడు. అది నూటికినూరుపాళ్లూ సుఖమయమే అని యిప్పుడు నిర్ణయించుకోవడం అవ్యక్తం అనిపించుకుంటుంది.

ఇంతవరకూ తను చేసినవన్నీ యెడపెడా విమర్శించుకుంటూనే వచ్చాడు. దానికి నిలవని కొన్నిటిని నిర్దాక్షిణ్యంగా వదిలించుకున్నాడు. అందులో తండ్రి పట్టుబట్టిన కాంట్రాక్టు వ్యాపారం ముఖ్యమైంది. తను వదిలించుకున్నా అది తనను వదిలేటట్లు లేదు! అయినా తన సర్వస్వం పణంగా పెట్టి ప్రయత్నించి చూడాలి. పాడిబర్రెలాంటి వ్యాపారం వదులుకోవడమా అంటాడు తండ్రి. తనను చీవాట్లు పెడుతున్నాడు. అయినా అందులో తనకు అభిరుచి యేర్పడకపోవడం యెందుకని? ఏమో.. అదంతా యీ క్షణాన వ్యాఖ్యానించుకోవాలంటే సాధ్యమయ్యేది కాదు. మరి బొత్తుగా మనసు అతుక్కోకపోవడానికి కారణం? అందుకు తను అప్పటికీ యిప్పటికీ చెప్పుకుంటున్నది వొక్కటే - అది, తన మనస్తత్వం శ్రీనివాసరావుగారితో యెన్నడూ కలియదు, అనేది. దానికి ప్రబలకారణం, రామస్వామిగారి కొడుకు తను కావడమే. అమాటే ఆయనకు ఖచ్చితంగా అదను దొరికినప్పుడు చెప్పివేశాడు.

## మట్టి కృష్ణమూర్తి

వ్యాపారమంటే యెందుకనో...దాని యెడల తనకు మొదణ్ణించీ అదే దృక్పథం... ఎదటివారిలో వున్న బలహీనతనే బలంగా చిత్రించి ఒక నూతన మానవీయతను సంపాదించడమే తన లక్ష్యం. అందుకు ఆలంబనంగా వున్న ఏ విధానాన్నైనా తను అవలంబించగలడు. కాని, తండ్రి చెప్పిన మార్గం దానికి పూర్తిగా భిన్నమైనది. స్వార్థంకోసం మానవత్వాన్నే మరుగుపర్చి తమ ప్రయోజనాలు సాధించుకోజూసే అవకాశం వారికి అడుగడుగునా దొరుకుతూనే వుంటుంది. కాకపోతే దీని వెనక ఏ కొంచెమో 'పరోపకార పారీణత' అనేది దాగివుందంటారు. ఆమాత్రం సద్భావలేశాన్ని తను గుర్తించగలడు. కాని, ఉప్పునీటి సముద్రంలో పవిత్ర గంగాతోయం కలిసినంత మాత్రాన వొరిగిందేమిటి?

చేసినపనికి ప్రతిఫలం పొందాలని తనూ వొప్పుకుంటాడు. కాని తన తండ్రిలాంటివారు అవలంబించిన మనస్తత్వం వంటిది జాతిని అడుగునించీ బాగుచేయలేదు; కాగా దానినుండి దూరంగా వుండాలనుకుంటున్నవాళ్లనుకూడా కొరివిదయ్యంలా బెదిరించి దారి తప్పించగల ప్రమాదం వున్నది. మరి, ఇదే జాతిని పునరుజ్జీవింప జేస్తుందంటారు, వీరే సంఘానికి మూలస్తంభాలని నమ్ముమంటారు. జరిగే వాస్తవాన్ని కళ్ళతో జూస్తున్న తను వీరిని, వీరి ఉత్సాహపూరిత వ్యాపారాలను యెలా అభినందించగలడు?

ఇదంతా శ్రీనివాసరావుగారికి సెమరుకు రాకపోతే మరొకమారు నచ్చబల్కి తను చేయదల్చుకున్నది చేసి తీరుతాడు. తను కంట్రాక్టు వ్యాపారం సాగించడానికీ, జడ్జీగారి అమ్మాయితో వివాహం జరగడానికీ యెలాటి సంబంధమూ లేదు. ఒకవేళ తండ్రి అలాటి భ్రమలో చిక్కుకొనివుంటే యీ పొగమంచు విడిపోవడానికి అరుణోదయం వెంటనే కావాలి!

జడ్జీగారికీ యీ వుద్దేశ్యం వుండడానికి వీల్లేదు. ఒకవేళ ఆయనా తన తండ్రిగారి కోవలోనే జేరిపోతేనో...అదీ సంభవమే. తనదాకా వచ్చేసరికి అలాటివారిలో అంతవరకూ లేని ఐక్యతకూడా పొటమరించే ప్రమాదం వున్నది. అసలు వారి పద్ధతే అంత. అయినా తనకు ఫరవాలేదు. ప్రస్తుతం తను వీరిద్దరితోనూ సంప్రదించి సలహాలు పొందవలసిన పనిలేదు. తనకున్న అవసరమల్లా వొకే వొక వ్యక్తితో—ఆమె సుశీల—సుశీల తనదైనప్పుడు ఎవ్వరూ యేమీ అనసాహసించలేరు. తనకు తానూ అంతే. అయినా తనలాగే సుశీలకూడా అనుకుంటుందనుకోవడానికి సాక్ష్యం యేముంది? నిన్నటి వరకూ ఆమె తనదనే అభిప్రాయమే లేదు. ఆమెకూ అంతేనేమో...కాని లేనిపోని ఆశలు కల్పించి ఆవేశాలను రేకెత్తించి, రెండు అమాయికపు హృదయాల్లో చిచ్చు రగిల్చారు.

వారు నిజంగా మనుషుల్ని కూడా యంత్రాలలాగే జమకట్టి వ్యవహరించుకుపోతూ వుంటారు. పూర్వాపరాలు విచారించకుండానే లేనిపోని సంబంధాలు అంటగట్టుతూవుంటారు. ఆమె భార్య కాబోతు

న్నదనీ, అతడు భర్త కాగలడనీ యిద్దరి హృదయాలలో వొక భావం నాటుకుపోయి నప్పుడు దానిని పూడజెరకడం యెవ్వరి తరం? ఏకారణంచేతనైనా దానికి విఘాతం కలిగినప్పుడు ఆ హృదయా లెంతగా ఘోషిల్లి పోగలవో వారికేం తెలుస్తుంది? ప్రాణాలతో చెలగాటకు ఇంతకంటే మరేం కావాలి?

ఏపాటి చదువూ, సంస్కారం వున్న వారైనా తనలాగే అనుకుంటారు. ఏకొణానైనా జరిగిన భావపరివర్తనాన్ని గ్రహించుకుని జీవితంపై దానికిగల ప్రభావాన్ని యథాతథంగా వ్యాఖ్యానించుకుంటారు. దీనిని ఆధారంగా చేసుకుని విమర్శించి చూసుకుంటే తనకు ఏనాడూ లేని భావపరివర్తనం యీనాటి ఉదయానే సంభవించింది. ఆవెల్లువలోనే పడి సుశీల తనకన్నుల కెలా కనబడుతుందీ? అన్న ఆవేశంతో కాలేజీకి కొట్టుకొనిపోయాడు. కాని అనుకున్నది తారుమారవడంతో మెదడుకి గొబ్బ తగిలినట్లైంది—అయినా తను నిరుత్సాహపడడు. అలాంటి అవసరంకూడా లేదేమో..

సుశీల కాలేజీకి రాకపోవడంతో తను నిర్మించుకుందా మనుకున్న ఆశాసౌధానికి అడుగునే అంతరాయం కలిగింది. ఆమెకోసమైన నిరీక్షణలోనే కళ్లు కాయలు కాయించుకున్నాడు. కాని ఫలితం దక్కలేదు. బహుశా తనంతటి ఆదుర్దా గాని, ఆవేశం గాని ఆమెకు లేదేమో...తను నిర్హేతుకంగా యింతటి ఆవేశానికి గురిఅయి లేనిపోని ఆశలు కల్పించుకుని విచారించడం పొరపాటయిందేమో...వాటన్నిటికీ ప్రతివిధానం తలపెట్టడమే, యీనాడు సుశీల రాకపోవడంలోని అంతర్యమై వుంటుందా?

అయినా తన భావవల్లిక యింతదూరం అలుముకున్నదని, దానికంతకీ తనే ఆధారమని పాపం, అమాయికురాలు సుశీల కేమి తెలుసుకి? సహజంగా సంక్రమించిన రేవో కొన్ని సంస్కారాల బలంవల్ల కొంచెం గర్వంగా, అహంభావంగా కనపడాలని పాటుబడిందే కాని, జీవితంలో యేనాడైనా అంతలోతుగా విచారించి యెరుగున్నదా? మరి రాకపోవడంలోని ఆంతర్యం? పరోక్షంలో వుండి యెవ్వరిద్వారానైనా, తనను, తన ఉత్సాహకర ప్రవర్తనలను పరీక్షించాలని అయివుంటుందా? ఆమాట అనుకోవడానికి ఆస్కారమే లేదు. తాను కనక కొంత తొందరగానే అంతటి భావావేశానికి గురిఅయ్యాడు కానీ, సుశీలలో వెనువెంటనే అంతటి భావ పరివర్తనం కలిగివుంటుందా? ఆమె అంతటి సాహసానికి తలపడుతుందంటే ఆమె నైజాన్ని గుర్తించిన తను నూటికి నూరుపాళ్లూ విశ్వసించలేడు.—

బలమైన సంఘటనగానీ, తగుపాటి ఆధారంగాని లేకుండా మనుషుల్లో మార్పులు వస్తయ్యా? కాకపోతే వొకటి నిజమై వుండవచ్చు, ఫలాని కుర్రవాడు తన కూతురికి భర్త కాబోతున్నాడని, అతణ్ణి మామూలుగానే కాలేజీలో చూస్తే అతనిపై వుండవలసిన గౌరవభావం వుండదని, ఏవో కొన్ని లాంఛనాలు జరిగాక, అనుకున్నది నిజమయ్యాక పంపుదామని జడ్జీగారే సుశీలను మాన్పించి వుంటారనేది. కాని దీనికేం బలమైనకారణం కానరావడంలేదు. తను ఏఁాటి భావంలో తలమునకలై యీనాడు పరుగెత్తుకు వెళ్లాడో అంటిది లేశంగానైనా సుశీలకు కలుగుతుందని లోకానుభవంలో తలపండిన జడ్జీగారికే స్ఫురించదని యెలా అనుకోడవం? నోరుచేసుకుని సుశీలను కటువుగా అటకాయించి వుంటారా? మరెందుకు రాకపోవాలి? ఎందుకో రాలేదు. అడగడానికి తనెవరు? ఆమె విషయంలో తనకేమిటీ అధికారం? ఏ ఆసరా జూసుకుని యిలా ప్రశ్నించుకుంటున్నాడు? తనకెందుకింత కచ్చ? అవును, తను భావుకుడుగాని అధికారికాడు. మనసు ఎంతో విశాలమైతేగాని భావన కుదరదు, అధికారి అయినవాడు మనసా, వాచా, కర్మణా మురుచుకుపోతూ వుంటాడు.—

అయినా జడ్జీగారు సుశీలకిదంతా చెప్పి వుంటారని దాఖలా యేమిటి? అలా యెన్నటికీ జరిగి వుండదు. మొదట చెప్పివుండకపోవచ్చు. కాని, తన తండ్రితో మాటలాడి వెళ్ళిన తరవాతనైనా చెప్పకుండా వుంటాడా? అంతటి ఆత్మవంచన చేసుకోవాల్సిన అవసరం ఆయనకేం వొచ్చింది? భావాలు ఉద్దేశ్యాలు వేరుగా వున్నా, తనకొకడితో - అందులో కాలేజీలో కళ్ళబడుతూవుండే వొకడితో సంబంధం ఖాయం చెయ్యబోతున్నారీ పెద్దలు - అనే సంగతి చూచాయగానైనా సుశీలకు తెలియకుండా వుంటుందా? తాను తలపెట్టినదానికి ఆమాత్రం ఆస్కారం వుంటే చాలు. యిష్టాయిష్టాల సంగతి తరవాత తేల్చుకోవచ్చు, ముందుగా తన మనసులో రేగుతున్నదంతా బైట పెట్టడానికి అవకాశం దొరుకుతుందిగదా! ఈ కల్లోలాన్నంతా ఆమె యెదట ప్రవహింపజేస్తే ఆ హృదయం కరుణావిలమై కరిగిపోతుందా? లేక కరకురాయివలె మొరటుగా ఢీకొంటుందా? అదేదో త్వరలోనే తెల్చుకుంటాడు తను. ఇందులో అసహజమైనదేమున్నది?

ముక్కూ - మొగం తెలియని వొకడు తనతో మాట్లాడవచ్చాడని, అందుకు లోకం తనను విమర్శించుతుందని, నిర్దాక్షిణ్యంగా తన అభ్యర్థనను కాలదన్నుతుందా? లేక ఆడపిల్లల విషయంలో కొంత సాహసించినందుకు నైచ్యానికి వొడిగట్టాడని తనను విమర్శించుతుందా లోకం? - విమర్శ యెప్పుడూ తప్పదు అందుకు భయపడి మనసుల్లోవున్న మర్మం దాచుకునేకంటే ఖులాసాగా మాట్లాడుకుని వాస్తవం గ్రహించి మసులుకోవడమే మంచిదని తనమట్టుకు తాను అనుకుంటాడు. అవసరమైనవాళ్లకు నచ్చజెపుతాడు కూడాను. సుశీలకూ ఆమాటే చెప్పదల్చుకున్నాడు. ఆమె అన్యమనస్కురాలైతే తానేమీ చెప్ప సాహసించడు. తన ఆశలన్నీ ఆమెపైనే నిక్షేపించుకొన్నట్లు తనకు తనే సాక్షి. అవి వొకరూపానికి రాకుండానే సాఫల్య వైఫల్యాలనుగురించి యోచించుకోవాలి. అందుకే ఇంత త్వరలో - ఈనాడే - తను సుశీలను చూడబోతున్నాడు - ఎదలో తీయని భావాలు మెదులుతూవుండగా కూనిరాగంతో కుర్చీలోనించి లేచి తువ్వాలు బుజాన వేసుకుని కొళాయిదగ్గిరకు నడిచాడు సుగుణభూషణుడు.

## 12

ఆనాడు తను కాలేజీకి వెళ్లకపోవడం వల్లా, స్నేహితురాండ్రెవరూ తనతో కలి

యకపోవడంవల్లా ఏమీ తోచక, మనసులో మోసులెత్తిన ఏవో కొన్ని భావాలు బరువెక్కి కృంగదీస్తున్నట్లున్నయ్ సుశీలకు. నిజానికి తనుమాత్రం నాన్నతో తాహతుకు మించి మాట్లాడిం దేమిటి? ఇదివరకు భావా లేవీటో ఆయనకు విచ్చ జెప్పడానికని సంభాషణలో కొంత తీవ్రంగా పోయినమాట వాస్తవమే. దానికి ఆయనగారెంత గుండెలకు గంటు పెట్టుకున్నట్టు దెబ్బతిన్నవాడిలా అయిపోవడ మెందుకు? ఆయన జీవితంలో తననుగురించి యింతకంటే చేయగల్గిందేమీ లేదంటాడు నాన్న. నిజంకూడా అంతేనా? తను ఎలా విశ్వసించగలదు?

మొదణ్ణించీ ఆమాత్రం చదువు, సంస్కారం కలది కావడంవల్లనే యెవ్వరేది చెప్పినా అంతతొందరగా మనసుకు పట్టించుకోలేక పోతున్న దేమో...యుక్తాయుక్త వివేకం లేని వారైతేనే సుఖంగా బ్రతగ్గలరేమో... తనకు తగుపాటి చదువు, స్వతంత్రం ఇచ్చి యిలా తయారు చేసినవాడు కూడా నాన్నేగా! తనిచ్చిన స్వతంత్రానికి జీవితంలో వొక్కమారైనా అవసరం వుండబోతుందని ఆయన అనుకోనివుంటే తనయెడల యింత మొరటుగా వ్యవహరించివుండేవాడు కాడేమో...తనలో యిలాటి భావస్వాతంత్ర్యాన్ని రెచ్చగొట్టి చివరికి టప్పున దీపం ఆర్పేసినట్టు అరచేతిదెబ్బ కొట్టినందువలన అది సరాసరి మెదడుకే తగులుతుందని ఆయనకు మాత్రం ఆకళింపుకు రాదా? పైగా కనిపెంచిన మమకారం అలా యేడిపిస్తూ వుంటుందని, దానివల్లనే తనకీ సంబంధం ఖాయం చేయబూనుకున్నాననీ ఆయన చెప్పే మాటలు కేవలం పెదవులకు పంచదార రాచుకొన్నప్పటివేనా? ఆయన జీవితానుభవం, ఉద్యోగపు హోదా, పెద్దలతో పరిచయం యివ్వన్నీ తనపై దాడిచేయడానికి మాత్రమే ఉపయోగించినై! జీవకారుణ్యం అనేది యేమాత్రం ఆయన గుండెల్లో గూడుకట్టుకొని వున్నా, యీ సంబంధం విషయంలో యింత కఠినంగా వ్యవహరించుకుపోయేవాడు కాడేమో...

తనను మొదణ్ణించీ అభం శుభం తెలియని అమాయకపుపందగానే పెంచివుంటే యీ వివత్తు ఇపుడు అడ్డంవచ్చేదికాదు. ఈ పుస్తకాలన్నీ ఆయనే కొనియిచ్చాడు. ఇవి చదివి ప్రపంచం అర్థం చేసుకోవాలనో, లేక రాతి కిందిరావిమొక్కలా యెదుగూ పొదుగూ లేక పడివుండాలనో మరి! ఈ వాఙ్మనియం బులుబులూ, యీ మధ్యనేగా కొనితెచ్చాడు. వీటిపై తన జీవిత రాగోదయాన్ని గానం చేసుకోవాలో, లేక తుది సంధ్యలో నిలబడి చరమగీతం ఆలపించుకోవాలో మరి అర్థంచేసుకోలేదు తను.

లోకంలో వొకొక్కరి మనస్తత్వం అలాటిది. వారెంత సన్నిహితులైతేనేం, ఏ చేతులతో పెంచి పెద్దజేశారో, చివరికి వాటితోనే బలియివ్వడానికైనా సందేహింపరు. అచ్చంగా యిప్పుడాయన చేసింది అంతే. అమ్మా, తల్లీ అని బుజ్జగించి జోలపాడుతూనే అడకత్తెరలో యిరికించాడు తన మెడను...బ్రతికివుండీ చచ్చిన చావైపోతున్నది. ఏసోవిధాన తన బెడద వొదిలించుకుంటేనే చాలు అనుకొని వుంటాడు. ఎంతటి పేరు ప్రఖ్యాతులు సంపాదించితేనేం, మరెన్ని మేడలూ మిద్దెలూ కట్టించితేనేం, కన్నబిడ్డపైనే

కరుణ, జాలి అనే వివేకం పోయింతర్వా

దేశం గొడ్డుపోయిందని తనకీ సంబం ఖాయం చేసుకోవాలా? తన అభిరుచికి పడిన యువకు డెక్కడా దొరక దొరకడా? కనీసం అలాటి వొక యింతవరకూ తన దృష్టిలో పెట్టుకో పోవడం పెద్దపొరపాటయింది. అతణ్ణిగ చేసుకోనని గట్టిపట్టు పట్టడానికై లేదిపుడు. తనకు భావాలైతే వున్నయ్యిగ వొక రూపానికి రాలేదేమో...అని అనుమానం. అలాటి దేదో జరిగే వుం యెవ్వరిపైనా తన కెట్టి మమకారమూ గకపోవడానికి కారణమేమిటి? ఇంతకూత వొక్కనాడేనా కూర్చుని తననిగురించి నిజమేమిటో విమర్శించుకో లేకపోయిం



# సుశీల



అలాటి తీరుబడే చిక్కలేదేమో... కాక వరభావాలను అనుకరించడం అభినందించడం లోనే కాలం గడిపిందేమో...

నవలల్లో నాటకాల్లో తనెందరెందరో నాయికల్ని గురించి చదివింది. అలాటి స్వాతంత్ర్యమే తనకూ వున్నదని కాసేపు తాదాత్మ్యం పొందినట్లు ఆ క్షణాన అభినందించుకుంటూ వుండేది. కాని, ఇప్పుడు తనేం చెయ్యబోతున్నది? ఏం చెయ్యాలి? కర్తవ్యం బోధించేవాళ్లెవ్వరూ లేరు. అన్నీ విచారించుకుని తనే కొన్ని నిర్ణయాలు చేసుకోవచ్చును, కాని ఆమాత్రం అవకాశం యివ్వకుండానే ఒప్పించాలని పట్టుబట్టి కూర్చున్నాడు నాన్న. ఈనాడైతే తనలో బైటపెట్టాడు కానీ యీ హాలాహలం యెన్నాళ్లనించీ ఆయనకు కంఠగతమై భుగభుగలాడుతున్నదో.

ఒకేపనిచేసినందువల్ల ఒకరికి జీవంపోసినట్లవుతుంది. మరొకరిని నిర్మూలించినట్లవుతుంది. అంతేగా మరి! ఆయన సలహాపైనే అక్కయ్యకు వివాహం జరిగింది. ఆయనగారిప్పుడే జిల్లా ఆఫీసర్ కావడానికి సిద్ధమౌతున్నాడు. - అంటే పెద్ద ఉద్యోగాలు చేసి విరివిగా డబ్బు సంపాదించేభర్త కావాలనేది తను ఏర్పరచుకున్న భావాలలో ఒకటా? ఏమో...ఏన్నడూ అలా అనుకొని వుండలేదే ... ఒకమారుమాత్రం అక్కయ్యే అన్నట్టు గుర్తు, చిననాన్నగారబ్బాయి బి. ఏ. చదువుతున్నాడని తెలిసి, ఈ బి. ఏ. లు, యం. ఏ. లు చదివి ఏవి ఉద్ధరిస్తారు? ఏ స్కూలులోనో ఓ వంద రూపాయల మాష్టరీ గిరీకి కుదరడమేగదా అని. అయినా తనామాటను అప్పట్లో మనసుకి పట్టించుకోనూలేదు. ఇతరులెవ్వరూ తన మొగుడంత ప్రయోజకులు కాలేరని అక్కయ్య అనుకుంటే అనుకోవచ్చు, కాని తనలా ఎందుకు ఒప్పుకుంటుంది? మరి తనకెలాంటి భర్తకావాలి? ఈ ప్రశ్న అచ్చంగా యిప్పుడే కలిగింది. సమాధానం? ఏమో ... పోనీ నూటికి నూరుపాళ్లూ తన భావాలతో యేకమయ్యే వ్యక్తిని వెతుక్కుంటే? - అదే చెయ్యవలసిన పని. కాని తనకున్న భావాలు ఎలాటివో, ఎంతటి మూఢమైనవో, మరెంతటి వాడి అయినవో ఒక్కనాడూ పరీక్షకు పెట్టుకోలేదు. తనకూ కొన్ని భావాలు వున్నయ్యని, అవి ప్రస్తుతపు నాగరకతను అనుబంధించుకునే వున్నయ్యని తన తోటివారికి చాలమందికి కూడా అంతేనని యింతవరకూ తనకు తెలిసిన సత్యం. లేక అందరూ అందర్నీ గురించీ అనుకుంటుంటే తనకు తానూ అంతే ననుకున్నదేమో...అంటే శూన్యంలో సౌధాన్ని కట్టుకున్నదన్నమాట! అయితే యెవ్వరో తనను మోసగించారనుకోవడం దేనికి? తన్ను తానే మోసగించుకున్నట్టౌతోంది. ఆత్మవంచన చేసుకున్నవారి కోవలోనే చేరిపోతున్నది. జీవితంలో యేదో ఒక ఘడియలో తప్పటడుగు వేయగలదు గానీ, మొదటికే మోసం తెచ్చుకుంటుందా? తనది అంతటి పరాధీన బుద్ధా? అమ్మ అంటూవుంటుంది, మా చిన్నతల్లికి మాయలూ మర్మాలు బొత్తిగా తెలియవు, వట్టి పిచ్చితల్లి అని. ఆ మాట అక్షరాలా తనయెడల సార్థకమయ్యిందన్నమాటా? అయితే తనేం పెరిగినట్టు? ముప్పాతిక మువ్వీసం యింకా శైశవం గూడు కట్టుకునే వున్నదన్నమాట! తన వ్యక్తిత్వం యీపాటిదే అయితే నాన్నతో యెందుకు ఎదిరించినట్టు? ఆ సంగతి తెలుసుకునే ఆయనా సుగుణభూషణుని వ్యవహారం చెప్పివుంటాడు__

సుగుణభూషణుడు! పేరుకేం నిక్షేపంలా వుంది. ఎవ్వరు పుణ్యం కట్టుకున్నారోగాని చాలా ఆలోచించి మథనపడి పెట్టివుంటారు. అవును అతడు బుద్ధిమంతుడు కాడనడానికి తన కేమిటి దాఖలా? తన జీవితము, భావాలనుగురించిన నిశ్చయ జ్ఞానమే లేనపుడు ఎదటివారిని కొలవబోవడం హాస్యాస్పదం కాదూ? తనలోవున్న బలహీనతే నిరాశగా రేకెత్తి అది అర్థంలేని కోపంగా మారి అతనిపై అంతకచ్చ పుట్టిస్తోందేమో...అందుకే అనివుంటాడు నాన్న, 'ఇతరుల్ని గురించి యెంతో తెలుసుకుంటే గాని ఒక్క మాటైనా అనకూడదు' అని. అది ఆయన జీవితపు లోతుల్లోనించి తవ్వుకొచ్చినదిగా

తోస్తుంది. మరి యింతసేపూ ఆయన్ను గురించి తనేమనుకొన్నది, ఎంతటి ద్రోహంగా ఆలోచించుకొన్నది? అదంతా మనసు చేసిన గారడీ గమ్మత్తేమో...

నాన్న పరేంగితం గుర్తింపగలవాడు కావడంవల్లనే సుగుణభూషణుడు ఆయనకంత ఘనమైవాడుగా తోచి వుంటాడు. ఆయనే చెప్పినట్టు తనకు తానై స్వతంత్రించి యేనాడు అతన్ని అర్థంచేసుకోవాలని ప్రయత్నించింది? అసలు అలాటి అవసరమే కలగలేదుగా! మరి అతన్ని గుడ్డిగా ద్వేషించడంలోని అర్థం, తన కతడు సరిపోలడనే అంధవిశ్వాసమేఅయివుంటుందా? ముందు కొంత ఔదాశీన్యము, తరవాత ద్వేషభావమూ అతనిపై తనకు కలగడానికి గల ప్రబలకారణం, అతని వేషమా? భాషా! లేక ప్రవర్తనా? లోతుగా ఆలోచిస్తే దేనిలోనూ వెగటు తోపింపజేసేటంతగా అతను వుండడనే అనిపిస్తుంది. అది గ్రహించడం వల్లనే నాన్న యిలా పంతంబట్టి వుంటాడు.

ఇంతకూ అతను వొప్పుకున్నట్టేనా? ఆమాట తనకు చెప్పడేం నాన్న? తనను గురించి అతనెన్నడైనా వించారించి వుంటాడా? అంత అవసరం యేమిటి? అందులోనూ ఆడపిల్లలంటే పరమ అసహ్యంగా వుంటాడని గదా అతన్నిగూర్చి తన నిర్ణయం?

రాత్రి వెళ్లినప్పుడు తండ్రితో మాత్రమే మాట్లాడి వచ్చానన్నాడు నాన్న. వీరిలో వీరుచేసిన నిర్ణయాలపైనే బిడ్డల భవితవ్యం ఆధారపడి వున్నదన్నమాటా? ఒకరి నొకరు సంప్రదించుకునె అవకాశం యెందుకు కల్పించరు? కావలసినదంతా అయినతరువాతనే మొహం యెదట నిలబెట్టి 'మీరిద్దరూ మొగుడూ పెళ్లాలని చెప్పెయ్యాలని వారి వూహాకాబోలు, అయితే చాలా వెనకబడే వున్నారన్నమాట! కాని అలాంటి అవకాశమే దొరికితే తనేం మాట్లాడుతుంది? అతనియడల తనకున్న భావాలు ఎలావ్యక్తం చేస్తుంది? ఏమో ఆ సమయానికి మన సెలావుటుందో...రాత్రికి నాన్న వొచ్చినప్పుడు కొన్ని విషయాలు ఖచ్చితంగా అడిగెయ్యాలి' అనుకుంటూ అక్కణ్ణించిలేచింది సుశీల. ఒక చేత్తో కిటికీ కమ్మె పట్టుకుని మరొక చేత్తో మొహంమీదికి వచ్చి పడుతున్న ముంగుర్లు సవరించుకుంటూ తదేకంగా కొంతసేపు వీధివేపు చూస్తూ నిలబడింది.

అత డెవరో రోడ్డువెంట నడిచిపోతున్నాడు. తెల్లటి పైజామా, అలాటి దే లాల్చీ. గుండీలు కూడా సరీగా పెట్టుకోలేదు. అడుగులు తొందరగానే పడుతున్నయ్. ఎంత తోసినా గిరజాల జుట్టు గాలికి వచ్చి పెంకెపిల్లవాడిలా మొహం మీద పారాడుతోంది. ఎవ్వరో పాపం... బహుశా యేదో విలువైన వస్తువును పోగొట్టుకుని వెతుక్కుంటూబయల్దేరి వుంటాడు—

ఒక్క క్షణంలో తన కళ్ళను తానే నమ్మలేకపోయింది సుశీల. అత డెవ్వరో కాదు, సుగుణభూషణుడే !—ఆఁ !... వీధిమలుపు తిరిగాడు, తన గేటు కెదురుగా వస్తున్నాడు! అత నెందుకు ఇటు వస్తున్నట్టు? ఏమిటీ ధైర్యం? ఏమిటీ సాహసం?? ప్రపంచమంతా అన్నివిధాలా తనమీదికే దాడిచేయ బూనుకున్నట్టున్నది! కలగంటున్నదా తను? కాదు, నిజమే!—

(ఇంకావుంది)

# ఆదర్శాల విలువలు

## వసంతరావు రామకృష్ణరావు

తన తల్లితండ్రీ బ్రతికి ఉంటే ఇలాంటి పరిస్థితి ఏర్పడేదా? తనకు జీవితంలో ఎదురయ్యే సమస్యలంటూ ఉండేవా? తన వ్యక్తిత్వాన్ని తన ఆదర్శాన్ని కాపాడుకొనేవాడు. కాని - తల్లిదండ్రులు చనిపోవటంతో తన బ్రతుకు చీకటి జీమూతం అయింది. తను బాబయ్య చేతిలో కీలుబొమ్మ. బాబయ్య చేసే పనులు తనకు ఇష్టం లేకపోయినా, అతని మాటకు తను ఎదురు చెప్పలేడు - చిన్నప్పటినించీ పెంచిన బాబయ్య అంటే తనకు అమిత గౌరవం. ఆ గౌరవం వల్లనే తనకు ఇప్పుడు ఒక సమస్య ఎదురయింది. వరకట్నం పుచ్చుకోడానికి బాబయ్య తన్ను బలవంతపెట్టి మరీ సంబంధం నిశ్చయించాడు. తను చాల బాధపడినా బాబయ్య ప్రయత్నం మానలేదు. ఒంటరిగా గదిలో కూర్చొని తన పెళ్లి సంబంధంగురించి ఆలోచిస్తున్న రామారావుకి కళ్లు చెమ్మగిల్లాయి.

చీకటి పడింది. విశ్రాంతికోసం రామారావు పార్కువైపు వెళ్లాడు. చిన్న గడ్డి తిన్నెమీద కూర్చుని పరధ్యానంగా రేడియో గీతాలు వింటున్నాడు. మానసికంగా ఏదో తీవ్రమైన అశాంతి చెలరేగుతున్నది. పార్కు వాతావరణంలో తనకు చిత్తశాంతి దొరకలేదు. లేచిపోదా మనుకొంటుండగా, కొద్దిదూరంలో ఇద్దరు వ్యక్తులు వచ్చి కూర్చున్నారు. రామారావు వాళ్ళిద్దరినీ పోల్చాడు ఆ లైట్ల వెలుగులో - తనతో చదువుకున్న సుందరం సూర్యం పార్కుకి వచ్చారు. తను సంజ చీకటిలో ఉండటం మూలాన్న వాళ్లు తనను చూడలేదు. మంచిపని జరిగింది. లేకపోతే వాళ్ల ప్రశ్నల పరంపర ఎదుర్కొనవలసివచ్చేది.

*　　　*　　　*

సూర్యం: విన్నావా! రామారావు మూడువేలు కట్నం పుచ్చుకొంటున్నాడు! అత్తారు గుంటూరుట. పెళ్లి వచ్చే మాఘమాసంలోనే—

సుందరం: అలాగ్రా - రామం నాకెంకా చెప్పలేదు లే—

సూర్యం: ఆ!! ఏం చెప్తాడులే - మనిషి పైకి బడాయిలు చెప్పగానే సరా—

సుందరం: అలాగా - వాడు బడాయిల రాయుడా—

సూర్యం: కాకపోతే మరేమిటి? - జీవితపు విలువలు చాలా చక్కగా పాటించే వాడిలా కబుర్లు చెప్పి, వాడు చేస్తున్న పని ఏమన్నా బావుందా?

సుందరం: కట్నం పుచ్చుకోవడం తప్పంటావ్?—

సూర్యం: తప్పా - తప్పన్నరా - రామారావు సంగతి నాకు బాగా తెల్సు - వాడికి బాబయ్య అంటే నిలువునా భయం—

సుందరం: అయితే బాబయ్యే కట్నం నిశ్చయించాడేమో!

సూర్యం: నిశ్చయిస్తే! చదువుకొన్న వాడు ఆదర్శాల బడాయి చెప్పి ఒప్పుకోవడం బావుందా!

సుందరం: పోనీలే! మనకెందుకు......

సూర్యం ఏదో మాట్లాడబోయి ఆగిపోయాడు. వీళ్లిద్దరి సంభాషణా, చాటుగా చీకటిలో కూర్చున్న రామారావు విన్నాడు. ఎంత అవమానంగా తనగురించి మాట్లాడుకొంటున్నారు! తనతో ఎంతో చనువుగా సరదాగా తిరిగే తన స్నేహితులేనా ఇలా మాట్లాడేది!

రామారావు మరి అక్కడ కూర్చోలేకపోయాడు. స్నేహితులు చూస్తారేమో అనే భయంతో మెల్లగా అక్కడినుంచి లేచి, పూలమొక్కల చాటున తలదాచుకొంటూ, గబగబా నాలుగు అడుగులలో పార్కు వదిలేసి,) బరువైన గుండెలతో, ఏదో నేరంచేసినవాడిలా బాధపడుతూ ఇంటికి వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

"ఏం! ఇవాళ అలా భోంచేశావ్ రామం" అంది వడ్డిస్తూన్న పిన్ని - పిన్ని ముఖంలోకి చూస్తూ "ఏంలేదు పిన్నీ - ఆకలవటంలేదు" అన్నాడు. ఆ మాట అందుకుని "అన్నాయ్ వదినకోసం బెంగెట్టుకొన్నాడులా ఉంది" అంది సుశీల వేళాకోళం చేస్తూ. భోజనాలదగ్గిరందరూ నవ్వుకున్నారు. బాబయ్య ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తోన్న ఆనందరేఖలు చూసి రామారావు విస్తుపోయాడు. కాని లేని నవ్వు తెచ్చుకొని, బాబయ్యకోసం నవ్వాడు.

*　　　*　　　*

కిటికీలగుండా ప్రసరించిన సూర్యుని లేత కిరణాల చక్కిలిగింతలకు రామారావుకు మెలకువ వచ్చింది. ఎదురుగా వున్న కేలండరు మీద అతని దృష్టి పడింది. తన పెళ్లికి వారంరోజులే వ్యవధి ఉంది. బాబయ్య, శుభలేఖలు అచ్చు వేయించాడు. చెల్లాయ్ సుశీల తండ్రి ఇచ్చిన ఎడ్రసులు కవరులమీద వ్రాసి పెడుతోంది. పిన్ని శుభలేఖలకి, పసుపు రాస్తున్నది. లేచీ లేవడంతోనే ఈ శుభదృశ్యాలు తనకు కనిపించినందుకు, రామారావు మనసులో తృప్తి స్థిరపడింది.

ముఖం కడుక్కొని కాఫీ త్రాగాడు. ఆ ఇంటిలో తనకంటే పిన్నికీ బాబయ్యకీ ఎంత వాత్సల్యం! బాబయ్యకి మగ పిల్లలు లేరు. ఉన్నది ఒక్క కూతురే - సుశీల. ఆ కారణంగా బాబాయి తనని కన్న కొడుకులా చూస్తున్నాడు. లేకపోతే చిన్నప్పుడే తల్లితండ్రులులేని బ్రతుకులో గాలిలో దీపంలా తను ఏనాడో అంతరించేవాడు. కాని, బాబయ్య ఆదరాభిమానాలతో తనను పెంచి, బ్రతుకులో దుర్గతిలేకుండా చేసేడు. అందుకే బాబయ్య అంటే తనకి తగని ప్రేమా - భక్తీను. ఆలోచిస్తున్నకొలదీ రామారావుకి తన పినతండ్రి చేసిన పనులలో ఔదార్యం కనిపిస్తోంది. బాబయ్యకి స్వార్థం లేదు. కాని ప్రతి విషయం వాస్తవికదృష్టితో పరిశీలించటం అతనికి అలవాటు. రామారావుకు ఎన్ని విధాలుగా ఆలోచించినా బాబయ్య కట్నం ఒప్పుకుని పెళ్ళి నిశ్చయించడంలో తప్పు కనిపించలేదు. తను వద్దని చెప్పినా బాబయ్య వింటాడు. కాని బాబయ్య మనస్సులో నొచ్చుకోవచ్చు. రామారావు ఆత్మపరీక్షకు పూనుకొన్నాడు.

తనకు ఒక దురలవాటుంది. ముందు వెనుకలు చూడకుండా కబుర్లు చెప్పేస్తాడు- ఆ చెప్పేటప్పుడు ఆదర్శం మనస్ఫూర్తిగా ఆచరణలోకి తేవాలనే అనుకుంటాడు కాని పర్యవసానం వచ్చినప్పటికల్లా పాతాళపు లోతులకు పోతుంది. తన జీవితంలో ఆదర్శం, ఆచరణా ఈ రెంటినీ సమన్వయించలేకపోతున్నాడు. నిజంగా అది అంత సులువైన పనికాదు. రామారావు స్మృతిపథంలో ఒక చిన్న సంఘటన మెరుపులా మెరిసింది. తనలో తనకే నవ్వువచ్చింది. నవ్వుకున్నాడు. నెలరోజుల క్రిందట కాలేజీలో జరిగిన డిబేటింగ్ పోటీలో తను

పాల్గొన్నాడు. "కట్నాలు సాంఘికపురోభి వృద్ధికి హానికరం" అనే ప్రతిపాదనకు తను అనుకూలంగా వాదించి మాట్లాడి శ్రోతలంద రినీ మెప్పించాడు. ఆనాటి వాగ్ధోరణికి అందరూ తనని చాలా అభినందించారు కూడా - కాని ఆ వాదం ఇప్పుడేమయింది? ఆదర్శం మంచులా కరిగిపోయింది! దీనికి కారణం తనా? బాబయ్యా? రామారావుకి తన శక్తిహీనత, భయమూ కళ్లకు కట్టినట్లు కనిపిస్తున్నాయి.

ఆలోచిస్తే ఇలా తను పరాజయము పొం దిన విషయాలు చాలా గుర్తుకు వస్తాయి. రామారావుకి జీవితం అనేది సమస్యలను సముత్పన్నం చేసే వింత యంత్రంలా కనిపిం చింది. చురుగ్గా లేచి, పదిపన్నెండు శుభ లేఖలు తీసి తన స్నేహితుల చిరునామాలు వ్రాసి పోస్టుచేసి వచ్చాడు. అప్పటికే తన ఇంటికి వచ్చిన, సూర్యానికీ, సుందరానికీ

# ★ ఆదర్శాల విలువలు ★

వ్యక్తిగతంగా పెళ్లికి తమ్ముని కోరి శుభలేఖ లిచ్చాడు.

*　　*　　*

గుంటూరులో కుమార్తె పెళ్లి ప్రయత్నాలు శేఖరం స్వయంగా ఏర్పాటుచేస్తున్నాడు. శేఖరం రెయిల్వేలో ఉద్యోగి. సామాన్యమైన సంపాదన - తండ్రి యిచ్చిన కొద్దిపాటి ఆస్తితో గౌరవంగా సంసారం చేసికొంటున్నాడు. అతనికి ఒక కుమారుడూ ఒక కుమార్తె. ఆ కూతుర్ని రామారావుకిచ్చి వివాహం చేయటానికి నిశ్చయమయింది. కుమారుడు గుంటూరులోనే ఇంటరు చదువుతున్నాడు.

ఆ సాయంత్రానికి మగపెళ్లివారు దిగుతారు. శేఖరం చాలా హడావిడిగా పనులు చేయసాగాడు. తన కూతురు ఒక్కర్తే - వివాహం ఇదే మొదటిసారిగా తను చేస్తున్నది. ఎవరికీ, లోపంరాకుండా చెయ్యాలని తాపత్రయ పడుతున్నాడు. శేఖరం భార్య, పార్వతి వంటసామగ్రులు సమస్తమూ జాగ్రత్తగా చేసికొంటున్నది. ఈ ప్రయత్నాలను గమనిస్తూన్న రాధకు అనేకమైన తీయని ఆలోచనలు కలుగుతున్నాయి. సిగ్గుపడుతూ తల్లిచాటున మసలటం ప్రారంభించింది.

మగపెళ్లివారి విడిదికోసం సమీపంలో శుభ్రమైన భవంతి యేర్పాటుచేశాడు శేఖరం. ఆధునిక పరికరాలు అన్నీ అక్కడ అమిరి ఉన్నాయి. గదులు శుభ్రంగా ఊడిపించి, తెల్లగా వెల్లవేయించి ఉంచాడు. గదులలోకి గాలి వెలుతురూ బాగా ప్రసరిస్తున్నాయి. శేఖరానికి అతని మిత్రులు ఒకరిద్దరు సహాయం చేస్తున్నారు.

అన్ని ఏర్పాట్లూ పూర్తి అయినట్లే - పెళ్లివారికి ఎదురు సన్నాహం చేయడమే తరువాయి. దానికి టైముకూడా దగ్గిర పడుతూంది. కాని ఒకేఒక గట్టి చిక్కు వచ్చిపడింది శేఖరానికి. ఇస్తానన్న మూడు వేల కట్నానికి అయిదు వందలు తక్కువైంది. దానికోసం తను ఎన్నో విధాలుగా ప్రయత్నించాడు. కాళ్ళు అరిగేటట్టు తిరిగాడు. ఆఫీసుద్వారా వెయ్యి రూపాయిల అప్పుకోసం మహజరు పెట్టుకొన్నాడు. కాని, నెలా పదిహేను రోజులైనా ఆ సొమ్ము మంజూరు కాలేదు. తనకు ఇట్లాటి పరిస్థితి యేర్పడుతుందని శేఖరంఅనుకోలేదు. డబ్బు వస్తుంది - కాని ఇప్పుడు తను తలపెట్టిన శుభకార్యానికి డబ్బు చాలకపోతే అపహాస్యం పాలుకావాలి. ఎక్కువ వడ్డీకి ఒప్పుకుని నాలుగైదు ప్రయత్నాలుచేశాడు, కాని ఫలించలేదు. స్నేహితులయినవాళ్లు తనదగ్గర సహాయం పొందడమేగాని, శేఖరానికి సహాయం చెయ్యలేదు. శేఖరం మతి చలించిపోయింది. ఒక విధమైన నిస్సహాయత అతనిని నిలువునా వశీకరించింది. అల్లుడి కట్నంలో డబ్బు మినహాయిస్తే వియ్యాలవారు కయ్యానికి వస్తారనే భయంతో శేఖరంకు ఏమీ పాలుపోవడం లేదు. నలుగురిలోనూ, తనకు అగౌరవం కలుగుతుంది. అల్లుడితో తు. హా ఫ ణ లు చెప్పకొని డబ్బు వెనుకనించి సర్దుబాటు చేస్తాననడం - అది ఒక్కటే మార్గం తనకు - అల్లుడు చిన్న బుచ్చుకోకుండా, రాధ అత్తవారి బంధువర్గం నొచ్చుకోకుండా తను ఈ విషమ సమస్యని నేర్పుగా, ఓర్పుతో పరిష్కరించాలి. అందుకనే పెద్దలు 'ఇల్లుకట్టి చూడు' 'పెళ్లిచేసి చూడు' అన్నారు! నిరుత్సాహం నిండిన బరువైన గుండెతో, శేఖరం పెళ్లివారిని తోడ్కొనరావటానికి బయలుదేరేడు.

*　　*　　*

పెళ్లివారు దిగారు - ఇల్లంతా సందడిగా వుంది. ఆడపెళ్లి వారి యింటిలో హడావుడిగా వుంది. మంగళవాయిద్యాలతో బ్రాహ్మణులు తొందరగా చదివే మంత్రాలతో కళ్యాణమండపం శోభాయమానంగా ప్రకాశిస్తూంది.

అల్లుడితో వచ్చిన స్నేహితులు సుందరానికీ, సూర్యానికీ ప్రత్యేకంగా సదుపాయాలు చూడడానికి శేఖరం ఒక కుర్రవాడిని నియమించాడు.

శుభముహూర్తం దగ్గిర పడుతున్నది. శేఖరం ఆందోళన అధిక మవుతున్నది. వధూవరులు పెళ్లిపీటలమీద కూర్చొనబోయే సమయంలో శేఖరం భయంగా రామారావు బాబయ్యవద్దకు వెళ్లి డబ్బుఇస్తూ ఐదు వందలూ తరువాత తప్పక సర్దుబాటు చేస్తానని ఎన్నో క్షమాపణలతో చెప్పకున్నాడు. బాబయ్య మొదట్లో చిరాకు పడ్డాడు - అయినా రామారావుతో రహస్యంగా చెప్పాడు - గొడవ లేదనుకునే సమయంలో, రామారావు ముసలి మేనత్త ఏదో గొణుక్కోవటం ప్రారంభించింది.

రామారావు పిన్ని, చెల్లి సుశీలా ఆవిడ పక్షం వహించడంతో, పెళ్లిపందిర్లో రెండు పార్టీలు ఏర్పడ్డాయి. రామారావు మేనత్త అది అవమానంకింద జమకట్టింది. తమ్ముణ్ణీ, మేనల్లుణ్ణీ దల్లగా చీవాట్లు పెట్ట సాగింది. ఈవిడ కోపంతీరు చూసి శేఖరం, అతని భార్యా భయపడుతున్నారు. పెళ్లి కుమార్తె ముఖంలో భయం దైన్యం కమ్ముకు న్నాయి. రామారావు మేనత్తపట్టుదల మనిషి- సంబంధం తేల్చెయ్యమని గొడవ చేస్తోంది. సుందరం, సూర్యం ఆవిడ వైఖరికి విస్తు పోతున్నారు. శేఖరం ఆమెను సమాధాన పరచాలని చూచాడు - కాని లాభం లేకపో యింది. రామారావు బాబయ్య కేసి, పిన్ని కేసి చూసి నిట్టూర్చాడు. మేనత్తతో తన బాబయ్య చెపితే బాగుండేది! కాని బాబ య్యకి ఆవిడ అంటే భయం - పిన్నికి మరీ భయం.

మంగళకరంగా కలకల్లాడుతోన్న కళ్యాణవేదికలో కలకలం బయలుదేరింది. సణుగులూ, శాపనార్థాలు వినిపిస్తున్నాయి. అందరి మనస్సుల్లోను ఏదో ఉద్విగ్నత క్రమంగా పొడుకొంటూంది. ఆ వాతా వరణం క్షణంలో వేదనాధీనమయిపోయింది.

రామారావులో ఒక్కసారి ధైర్యం పెల్లు బికింది. తనలో రూపొందిన జీవితపు విలు వలు సాఫల్యం చేసికొనే సమయం వచ్చింది. సమస్యని తనే సామరస్యంతో పరిష్క రించగలననే ఆత్మవిశ్వాసం అతనికి కలిగింది. తను ఆదర్శవాదం అక్షరాలా ఆచరించ లేక పోవచ్చు - కాని అవకాశాలను బట్టి తను ప్రవర్తించితేనే వ్యక్తి విలువలకు సంఘంలో గౌరవం ● భిస్తుంది. దానికి ధైర్యం, విశ్వాసం అవసరం. తన స్నేహితులకు కూడా తనకురించి అపోహ, అదే. రామారావుకి వ్యక్తిత్వాన్నే సవాలు చేస్తోంది. ఆ సమస్యపట్ల తను ధైర్యంగా ప్రవర్తిస్తే మొదట్లో విప్లవం కనపడినా, తుదిలో అది లాభదాయకం అవుతుంది. బాబయ్యా, పిన్ని తనకు వ్యతిరేకులు కాదు. చాదస్తపు ముసలి మేనత్త అందరిమీద ప్రభుత్వం చెలాయించుతున్నట్లు అతనికి తోచింద.

రామారావు మధుపర్కాలతో లేచి బాబయ్యకూ, పిన్నికీ భక్తితో నమస్కారం చేశాడు వాళ్లేదో ఏదో తొట్రుపాటు- గబగబా అతడిని దీవించారు చలనంలేని వాళ్లలా. తర్వాత మేనత్తవద్దకు వెళ్లి నమ స్కరించాడు. ఆమె పెద్దగా ఏదోమాట్లాడ బోయింది. రామారావు తలెత్తి చూడ కుండా అన్నాడు. "అత్తా! ఈ శుభసమ యంలో నీవు గొడవచెయ్యడం నాకూ, చాలమంది బంధువులకీ బాధకలిగిస్తోంది. నన్ను క్షమించి దీవించు. తరువాత విష యాలుగురించి నీకు గొడవ అనవసరం అను కుంటాను" అన్నాడు. ఆమె మాట్లాడ లేదు. అతడ్ని చురచురా చూసింది.

పెళ్లి సవ్యంగా జరిగిపోయింది. రామా రావుకి అప్పటినుంచీ, భయం, పిరికితనం పోయేయి. అందరూ వధూవరులను మన స్ఫూర్తిగా దీవించారు.

★




# అలవాట్లు

"అబ్బబ్బా...ఏమి అలవాట్లో నమ్మా యివి. పెందలకడ ఇంటికి రమ్మని ఎన్నిసార్లు చెప్పినా ఈయనకు రాత్రి ఎనిమిదయితే నేగాని ఇల్లు జ్ఞాపకం రాదు" అని విసుక్కుంటుంది పొరుగింటి ఇల్లాలు, నలుగురు బిడ్డలతల్లి విశాలాక్షి.

"ఏమి అలవాట్లో యేమిటో, పేత్తనాలకు వెళ్లవద్దనీ, మీయింట్లో ఇవాళ కూరలేమిటని ఇరుగు పొరుగువాళ్లను అడగవద్దనీ ఎన్నిసార్లు చెప్పినా యీ ఆడవాళ్లకు అక్కరలేదు" అంటాడు ఆ ప్రక్కయింటి మిత్రుడు సుబ్బారావు.

సంసార జీవితంలో భార్యాభర్తలు రోజూ ఎదుర్కొనే అలవాట్ల సమస్య లివి. అలవాట్లు సంసార జీవితంలో చాలా ప్రధానపాత్ర నిర్వహిస్తవి. భార్య అలవాట్లు భర్త మన స్తత్వంమీదనూ, భర్త అలవాట్లు భార్యమీదనూ పనిచేస్తవి. వీటివల్ల ఒండొరుల ప్రేమానురాగాలు ఎక్కువయి సంసార జీవితం సుఖమయమైనా కావచ్చు. లేదా వాటివల్ల ఒకరిమీద మరొకరికి ద్వేషమూ విరక్తీ పుట్టుకొచ్చినా పుట్టుకరావచ్చు.

విశాలాక్షి మన స్తత్వం ఏమిటి? మధ్య తరగతిలో ఇటువంటి విశాలాక్షులు చాలామంది వుంటారు. భర్త ఆఫీసునుంచి పెందలకడ యింటికి రావాలని భార్య ఎందుకు కోరుకుంటుంది? ఇంటికి వచ్చి భర్తలు తమకేదో యింటిపని చేసిపెట్టాలని ఆశిస్తారా ఇట్టి మన స్తత్వంగల ఆడవాళ్లు? అలా ఆశించినా ఆశించవచ్చు. ఇంటి పనులంటే ఇంట్లోకి నీళ్లు తీసుకురావడం, ఇల్లు ఊడవడం వంటి పనులేనా యేమిటి? విశాలాక్షికి నలుగురు పిల్లలని చెప్పాను. నాలుగో పిల్ల నాలుగేండ్లది.

## ఎ. యస్. అవధాని

ఒకనాడు విశాలాక్షి భర్త ఆఫీసుకు వెళ్లిన తరువాత ఆ నాలుగో పిల్ల మేడమెట్ల మీదనుంచి జారిపడ్డది. ఇంకా నయం! కుడిచెయ్యి మాత్రమే విరిగింది. విశాలాక్షి భర్త రంగారావు ఆవేళ ఉదయం పది గంటలకు ఆఫీసుకు వెళ్లి రాత్రి ఎనిమిదిన్నరకు ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి విశాలాక్షి ఆ పిల్లచేతికి అమృతాంజనం రాచి వేడినీళ్ళకాపు వేస్తున్నది. అది చూచేటప్పటికి రంగారావుకు గుండెఆగిపోయినంత పనయింది. చెయ్యిబెణకడం కాదది. విరిగింది. భార్యకు ఆసంగతి చెప్పలేదు. ఆమర్నాడు ఆపిల్లను ఆస్పత్రికి తీసుకువెళ్లి కట్టు కట్టించేవరకూ అతనికి మనశ్శాంతి అనేది లేకపోయింది. ఇది చాలా సహజమైన విషయమే. ఆఫీసుకు వెళ్లేటప్పుడు ఇంట్లో అందరూ బాగానేవున్నారాయెను. ఇంటికి తిరిగి వచ్చేలోగా ఎవరికో యేదో ముంచుకువస్తుందని గాని, ఎవరికయినా ఏదైనా ప్రమాదం సంభవించివుండవచ్చునని భయంగాని ఇంటినుంచి బయటికి వెళ్లే ప్రతి మగవాణ్ణీ ఎప్పుడూ వేధిస్తూఉండవలసినదేనా యేమిటి? అటువంటిదేమీ అవసరం లేదు. కాని, ఆఫీసుపని అయిపోయిన తరువాత కొంచెం త్వరగా మగవాడు ఇంటికి రావాలని ఆడది ఆశించడంలో తప్పేమిటి? అంటే మన పూర్వీకు లందరూ ఎప్పుడూ ఆడవాళ్లకు ఎదురుగా కూచునేవాళ్లాయేం? అదీకాక పగలంతా ఆఫీసులో పనిచేసిన తరువాత కొంచెంసేపు స్నేహితులతో కాలక్షేపం చెయ్యకపోతే మనస్సుకు ఉల్లాసం కలిగే ఆస్కారమేదీ? ఇక ఎప్పుడూ ఇల్లూ ఆఫీసూ – ఇవి రెండేనాయేం జీవితానికి కావలసినవి? జీవితానికి ఇంకా యేమీ అవసరం లేదా అని కొందరంటారు.

పైకి చాలా చిన్నవిగా కనిపించే యీ అలవాట్ల కారణంగా సంసారానికి చాలా కష్టనష్టాలు వాటిల్లుతూండడం మనం రోజూ చూస్తునే వుంటాము. కాని, ఈ అలవాట్లను మార్చుకొనడానికి చెప్పుకోతగ్గంత ప్రయత్నం మాత్రం జరుగుతున్నట్లు కనిపించదు.

పైన పేర్కొనబడిన ఉదాహరణల లోని మొదటి సంఘటన సంగతేమిటి? రంగారావు ఆఫీసునుంచి పెందలకడ ఇంటికి రావడానికి ఆక్షేపణ ఏమిటి? ఆఫీసులో పని ఎక్కువగా వుండి ఇంటికి సకాలంలో తిరిగి రాకపోతే అది వేరేసంగతి. ఒకవేళ ఆఫీసులో పని ఎక్కువగా వుండడమంటూ జరిగినా అది ఎప్పుడూ జరిగేవిషయంకాదు. అలాకాదు. ఆ ఉద్యోగ స్వభావమే అటు వంటిది. పొద్దున పదిగంటలనుంచీ రాత్రి ఎనిమిదిగంటలదాకా పనిచేయవలసి వుంటుం దని అనుకుందాము. అటువంటప్పుడు అయిదుగంటలు దాటిన తరువాత చేయవల సిన పనిని ఇంటికి తీసుకువెళ్ళి చేస్తానని ఆఫీ సరుకు చెప్పవచ్చు. ఆఫీసరు ఒప్పుకో

# ★ అలవాట్లు ★

కావడమనేది కూడా సాధ్యమే. కాని సాధారణంగా జరిగే విషయం కాదు. పైగా ఆఫీసుపని చెయ్యడంతోపాటు నాకు మరో జీవితంకూడా ఉన్నది. నేను నిర్వర్తించవలసిన మరో ధర్మంకూడా ఉన్నది. వాస్తవానికి ఆ ధర్మనిర్వహణ ఉపాంగులలో ఈ ఉద్యోగం ఒకటి అనే దృష్టితో వ్యవహరించే ఉద్యోగి తన పై ఆఫీసరుకు యీ విషయం నచ్చచెప్పగలడు.

ఆ విషయం అలా ఉంచండి. ఇక్కడ ఆలోచించదగిన మరొక విషయంకూడా వున్నది. ఆఫీసుపని చేసేటప్పుడు కొందరు ఉద్యోగులు అయిదు గంటలదాకా చాలా నిబ్బరంగా, నిదానంగా వ్యవహరిస్తారు. అయిదుగంటలకు కాఫీ సేవించి ఇక అక్కడినుంచి ఆఫీసంతా తమ ఒక్కరి కారణంగానే నడుస్తున్నట్లు కాగితాలన్నీ ముందర వేసుకు కూచొంటారు. ఇది వారి అలవాటు. ఈ అలవాటుకు కారణమేమయినా కావచ్చు. కాని, ఇది మంచి అలవాటు అని మాత్రం చెప్పలేము. ఒకవేళ మంచి అలవాటే అయినా గృహిణి దృష్టిలో మాత్రం మంచి అలవాటు కానేకాదు.

అసలు మగవాడు పెందలకడ ఇంటికి తిరిగిరావాలని కోరుకొనడంలో ఆడదాని ఉద్దేశమేమిటి అనే విషయం సరిగ్గా అర్థం చేసుకోవాలి. ఇంటికి వచ్చి భర్త తనకు ఏదో పనిచేసిపెట్టాలనే ప్రతి భార్యా ఆశిస్తుం దనుకొనడం పొరపాటు. పగలల్లా ఆఫీసులో మగవాడు ఎంత కష్టపడి పనిచేసి ఉంటాడో, మధ్యతరగతి ఆడదికూడా ఇంట్లో పగలల్లా అంత కాకపోయినా కొంచెం ఇంచుమించుగా మరొకరకమైన శ్రమ అంటే చేసివుంటుంది. రాత్రి మళ్లీ పిల్లలను సముదాయించుకోవడం భర్త అవసరాలను చూడడం సరిపోతుంది. అటువంటప్పుడు సాయంకాలం భర్త పెందలకడ ఇంటికివస్తే కొంచెంసేపు ఇద్దరూ ప్రశాంతంగా కూర్చుని కాలక్షేపం చెయ్యాలని భార్య కోరుకోవడంలో తప్పేమిటో అర్థంకాదు. భర్త కావాలంటున్న ఉల్లాసం భార్యకు మాత్రం అవసరంలేదా? అవసరమయితే ఇరుగు పొరుగు ఆడవాళ్ళలో కాలక్షేపం చేయవచ్చునని కొందరంటారు. కాని, భర్తతో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కూర్చొనడంవల్ల కలిగే ఉల్లాసమూ తినవంటి ఇరుగు పొరుగు ఆడవాళ్లతో కాలక్షేపంచేసి పొందగలిగే ఉల్లాసమూ ఒకటికాదని గ్రహించడం అవసరం.

ఉల్లాసమనేది అనురక్తికి సంబంధించిన విషయం. ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క విధంగా ఉల్లాసం సంపాదించడం సృష్టి సహజమైన విషయం.

అసలు మగవాళ్ళు పగలల్లా ఇంటికి దూరంగా వుండాలని ఎందుకు కోరుకొంటారు? అనేక కారణాలను చెబుతారు. చాలీచాలని జీతం. నిరంతరం వేధించే సమస్యలు. అమితంగా బాధపెట్టే ఆందోళనలవల్ల జీవితంమీద రోసి, చావలేక, బతకలేక, చచ్చీ చావకుండా, బతికీ బతక్కుండా, చచ్చి బతుకుతూ కాలక్షేపం చేస్తున్నాము. ఇటువంటి మాకు ఇంటిని చూస్తే భయమని కొందరు వాదిస్తారు. ఇది సమంజసమయిన వాదం కాదు. వాస్తవమూ కాదు. ఒకవేళ ప్రస్తుత సాంఘిక ఆర్థిక పరిస్థితుల కారణంగా కుటుంబమంటే భయం పుట్టేమాట నిజమే అయినా కుటుంబజీవితానికి దూరంగా వుండి ఆ భయం పోగొట్టుకోవడం సాధ్యం కాదు. పరిస్థితులను సమగ్రంగా అర్థంచేసుకొని శక్తిసామర్థ్యాలను రాణింపచేసుకొని సంపాదన ఎక్కువ చేసుకోవాలే గాని నాకు సంసారమంటే భయం అందువల్ల పగలల్లా ఇంటికి దూరంగా మసలుకుంటాననడం సబబు కాదు.

ఇక రెండవ ఉదాహరణలోని సుబ్బారావు భార్యసంగతి తీసుకుందాము. మొదట చెప్పిన సంఘటనలోని వ్యక్తుల ప్రవృత్తికి యీ ఉదాహరణలోని వ్యక్తుల ప్రవృత్తి పూర్తిగా విరుద్ధం. సుబ్బారావు ఓ బళ్లో పంతులుద్యోగం చేస్తున్నాడు. చెప్పుకో తగ్గ ఆస్తి యేమీ లేదు. గుట్టుగా సంసారం నెట్టుకురావాలని అతని అభిమతం ఇంట్లో

వున్నంతసేపూ పిల్లలతో కాలక్షేపం చేస్తాడు. పిల్లలకుకూడా సుబ్బారావంటేనే ఎక్కువ ప్రేమా యేమిటి అనిపిస్తుంది. సుబ్బారావుకు స్నేహితులేమీ తక్కువకాదు. ఆ స్నేహితులతో ఎంతవరకు మాట్లాడాలో అంతవరకే మాట్లాడతాడు. సమయాన్ని బట్టి "వస్తా కొంచెంపని ఉన్నది" అని చెప్పి ఇంటికి తప్పించుకు వస్తాడు. ఇట్లా ఎందుకు వస్తాడూ? అది అతని అలవాటు. వీలయినంతవరకూ జీవితాన్ని గుట్టుగా నెట్టుకు రావాలని అతని కోరిక. ఆ కోరిక కారణంగానే తన భార్యకూడా యిరుగు పొరుగమ్మలతో ముక్తసరిగా వుండాలంటాడు. సుబ్బారావు భార్య సావిత్రి చిన్నతనంలో పదిమంది తిరిగేయింట్లో గడపడంవల్ల ఇంట్లో పని అయీ కాకముందే పొరుగింటి వాళ్లతో చక్కట్లు మొదలెడుతుంది. అది ఆమె అలవాటు. సంసారాన్ని గుట్టుగా నెట్టుకురావాలని కొంతకు కొంతగా ఆమెకూ తెలుసు. కాని, నలుగురు ఆడవాళ్లూ ఒక్కచోట కూర్చునేటప్పటికి ఆ మాట మీదా, ఈ మాటమీదా ఏదో లోకాభిరామాయణం రావడం చివరికి మాటి విరుపులతో నాటి సమావేశం పరిసమాప్తం కావడమూ పరిపాటి. ఇటువంటి గొడవ సుబ్బారావుకు పనికిరాదు. కాని, ఏం చేస్తాడూ? భార్య అలవాట్లను మార్చాలి. అది అంత సులభంగా అయ్యేపని కాదు.

ఇవి బయటి వాతావరణానికి నడవడికీ సంబంధించిన అలవాట్లు. ఒకే యింట్లో ఒకరికొకరు చేదోడు వాదోడుగా బ్రతకవలసిన భార్యాభర్తల అలవాట్లలో సర్దుబాటు చాలా అవసరం. అన్నంతినే పద్ధతి, దుస్తులు వేసుకునే పద్ధతీ మొదలయినవన్నీ అలవాట్లే. ఈ అలవాట్లను అర్థంచేసుకోవాలంటే సహనం కావాలి. సహనం ఉన్నా లేకపోయినా కొంతకాల మయ్యేసరికి సరిపెట్టుకు పోవడమనేది ఎటూ జరుగుతుంది

మధ్య తరగతి కుటుంబాలలో సాధారణంగా భర్త అలవాట్లకు వీలుగా భార్య సర్దుకుపోవడానికి ప్రయత్నిస్తుంది.

కొంచెం కలవారి కుటుంబాలలో భార్యాభర్తలు ఎవరి అలవాట్లను వారు అనుసరించే అవకాశం వున్నది.

బాగా సిరిసంపదలు కలవారి కుటుంబాలలో యీ అలవాట్లు అనేవి వ్యక్తిత్వానికి సంబంధించిన విషయాలుగా పరిణమించి అనేక సమస్యలకు కారణం కావచ్చు. లేదా అట్టి అలవాట్లు గల భార్యాభర్తల సంతానం విశిష్టమైన వ్యక్తి

# అలవాట్లు

త్వాన్ని అలవరచుకొన్నా ఆశ్చర్యపడవలసిన అవసరం కనిపించదు. ఈ రెండూ కాక ఇట్టి అలవాట్లున్న భార్యాభర్తల చెప్పుచేతలలో పెరిగిన పిల్లలు ఎందుకూ కొరగానివాళ్ళుగా తయారయినా కూడా ఆశ్చర్యపడవలసిన అవసరం అంతకన్నా కనిపించదు.

ఎందుచేతనంటే "నువ్వు నువ్వే నేను నేనే. నువ్వు దిగిరావద్దు. నేనూ దిగిరాను" అనే దృక్పథం దేనికయినా ఉపయోగపడుతుందేమోగాని సంసార జీవితానికీ, పిల్లల పోషణకూ ఎంతమాత్రం పనికిరాదు.

అంతమాత్రాన వ్యక్తిగత జీవితమనేదానికి సంసార జీవితంలో అవకాశమనేది ఎంతమాత్రం లేదనికాదు. వ్యక్తిగత జీవితమూ, భార్యాభర్తల మధ్య రహస్యాలూ ఉండడం సహజమే. కాని, వీలయినంతవరకు అవి సంసారమనే హద్దుకు సమన్వయం కావాలి. దీనినే కలుపుగోలుతనమని చెప్పుకోవచ్చు.

అందుచేతనే సంసార జీవితంవల్ల ప్రజాస్వామిక సంప్రదాయాలు అలవడుతవని కొందరంటారు. గృహస్థాశ్రమమనేది ఆశ్రమాలలోకల్లా ఉత్తమమని మన పూర్వీకులన్నారు.

ఇంతకూ ఒకరి నొకరు అర్థంచేసుకొంటేనే గాని వివాహం పనికిరాదని అంటున్నారుగదా? మరి ఒకరి నొకరు అర్థంచేసుకొనడమంటే యేమిటి? వరుడు వధువునూ, వధువు వరుణ్ణీ అర్థంచేసుకొంటే ఇక ఆ సంసారం సుఖపడుతుందనే మాట ఖాయమేనా? ఈ భార్యాభర్తలు బ్రతకవలసిన సమాజం మాట యేమిటి?

అత్తవారింటి అలవాట్లు కోడలుకు సరిపడవలసిన అవసరం ఉన్నదిగదా? అత్తవారింటి అలవాట్లను అర్థంచేసుకొని, వాటిని సహించి, తన అలవాట్లతో కోడలు సమన్వయం చేసుకొనవలసిన అవసరం ఉన్నదిగదా? అలా కాదు. మేము సంపాదించుకుని బ్రతుకుతాము కనుక మా తల్లిదండ్రుల అలవాట్లూ, సంస్కారంతో మాకేమి సంబంధమని కొందరు అనవచ్చు. ఇలా అనడంలో అర్థం ఏమిటి? పెండ్లికావడంతో తమ తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములతోటి సంబంధ బాంధవ్యాలన్నింటికీ తిలోదకాలు ఇస్తామనేనా ఇలా వాదించేవారు చెప్పేది. వీరు దూరంగా వేరేవుంటే మాత్రం రాకపోకలూ, ఆప్యాయతా, కష్టసుఖాలలో సానుభూతి అనందాలూ అనేవి అవసరమే లేదా? ఇటువంటివే లేకపోతే జీవితం దుర్భరం కాదా?

ఆధునిక విజ్ఞానం ఎంతగా అభివృద్ధిచెందినా స్వేచ్ఛాపిపాస ఎంత ఎక్కువయినా మానవుని సహజాతాలు, వాసనలు అనేవి అంతగా మారలేదు. కనుక సహజంగావుంటే అలవాట్లను ధిక్కరించితే ఆ జీవితం చాలా బాధాకరంగా వుంటుంది. కాబట్టి భార్యాభర్తలు ఒకరి అలవాట్లనొకరు మన్నించి గౌరవించి సాధ్యమైనంతవరకూ సమన్వయం చేసుకోవలసిన అవసరం ఎంతయినా ఉన్నది. 

వనితాలోకం:

# చిన్నిపరీక్ష

సావిత్రికి రెండో పెళ్లి సంబంధమే కుదిరింది. రెండోపెళ్ళివాడయినా వరుడు, కామేశ్వరరావు, మరీ పెద్దవాడేమీ కాదు. అతని వయస్సు ఇరవై ఎనిమిదేళ్ళుంటాయి. మొదటి భార్య పోయి ఆరు నెలలయింది. ఆమె సంతానం ఒక్క ఐదేళ్ల కుర్రవాడు మాత్ర మున్నాడు. కామేశ్వర రావు అందగాడుకూడా. ఒక విదేశీ కంపెనీ బ్రాంచిలో హెడ్ అక్కౌంటంటుగా పని చేస్తున్నాడు. సావిత్రి సంతోషంతోనే ఒప్పుకుం దీ సంబంధానికి. కట్నం భార మూ ట్టలేదు కాబట్టి సావిత్రి తల్లిదండ్రులకు కూడా ఎంతో సంతోషంగా ఉంది.

కామేశ్వరరావు తన పెళ్లికి తన కొడుకును కూడా తీసుకురాకూడదు కాబట్టి రాంపండును తీసుకురాలేదు. సావిత్రి ఆడబిడ్డలూ వాళ్లూమాత్రం చెప్పారు రాంపండు చాలా ముద్దుగా ఉంటాడనీ, వాడిని చూసిన వారు విడిచిపెట్టలేరనీని. సావిత్రి ఎప్పుడు రాంపండును చూద్దామా, ఎప్పుడు వాడిచేత 'అమ్మ' అనిపించుకుందామా అని ఉవ్విళ్లూరసాగింది. అత్తవారింట మను గుడుపులకు వెళ్లినప్పుడు రాంపండును చూడవచ్చుననుకుంది. కాని అక్కడ రాంపండు ఆమె కంటబడలేదు.

చివరిరోజున సావిత్రి ఆడబిడ్డలతో కూర్చుని పచ్చీసు ఆడుకొంటూంటే రాంపండు చిన్ని జేబులో బొంగరమూ, ఎడమచంకలో కుక్కపిల్లబొమ్మ పెట్టుకొని, కుడిచేతితో బెల్టులోనుంచి జారిపోతున్న లాగు పైకి దోపుకుంటూ ఆ గదివైపుకే వచ్చాడు. సావిత్రి పెద్ద ఆడబిడ్డ "వీడే నమ్మా, నీ కొడుకు" అని రాంపండును చూపించింది. సావిత్రి వాడికేసి చూసింది.

చిన్ని మొగంమీదకు పడుతున్న ఆ దుబ్బు జుట్టూ, ఆ గుండ్రని పెద్దకళ్లూ, చిదిమితే పాలుకారుతాయన్నట్లున్న బుగ్గలూ, చిన్ని పెదవులూ చూస్తూంటే దగ్గరకు తీసుకొని ముద్దాడుదామని లేచింది. సావిత్రి పెద్ద ఆడబిడ్డ "దా, రాంపండూ, ఇదుగో మీ అమ్మ" అంది. రాంపండు గడపదగ్గర ఆగిపోయి తల ప్రక్కకువంచి సావిత్రికేసి తదేక దృష్టితో చూడసాగాడు. ఆ చూపుకు సావిత్రి ఆశ్చర్యపోయింది. అయినా ఎత్తుకుందామని ముందు కదుగు వేయబోతూంటే రాంపండు నిర్లక్ష్యంగా మొగం త్రిప్పివేసుకొని వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు. సావిత్రి అలాగే నిలబడిపోయింది. ఆడబిడ్డలు నవ్వారు. "చూశావా వదినా, నిన్ను ఎలా చూశాడో రాంపండు! ఎవరీమె, మన

వాసమూర్తి

ఇంటికి వెంటనే వచ్చిందే, నాన్న ప్రక్కన ఎందుకు కూర్చుంటోంది అని పరీక్ష చేస్తున్నాడు. సంజాయిషీ చెప్పుకోవాలమ్మాయి" అంది చిన్న ఆడబిడ్డ. సావిత్రికి సిగ్గూ, నవ్వూ రెండూ వచ్చాయి. "రాంపండుకు కొత్త ఎక్కువేమిటి?" అని అడిగింది మెల్లగా. "చిన్న పిల్లలందరికీ మొదట్లో అలాగే ఉంటుందిలేవమ్మా, ఒక్క రెండు రోజులు చనువిచ్చావంటే ఆపైన నెత్తికెక్కి కూర్చుంటాడు" అని చెప్పింది పెద్ద ఆడబిడ్డ. సావిత్రి తిరిగివచ్చి ఆట సాగించింది.

పుట్టింటికి తిరిగివెళ్లేలోగా ఒక్కసారైనా రాంపండును గట్టిగా ముద్దాడాలని సావిత్రి ఉబలాటపడసాగింది. సాయంత్రం రాంపండు మళ్లీ ఆ గదివైపుకే వచ్చాడు. ముందు లోపలికి తొంగిచూసి ఎవరూ లేరు కదా అనే ధైర్యంతో గదిలోనుంచి పోసాగాడు. సావిత్రి చాటునుంచి చూసి వెనకాలే రాంపండుదగ్గరకు పరుగెత్తింది. పారిపోబోయాడు కాని సావిత్రి వాడిని పట్టివేసుకొని, ఎత్తుకొని, ముద్దుపెట్టుకుంది— అంతే 'అమ్మ' అంటూ బాధతో విడిచిపెట్టివేసింది. 'ఎంత గట్టిగా కరిచివేశాడు! పళ్లు నొక్కులుకూడా పడ్డాయి' అనుకుంటూ చేతితో రుద్దుకుంది. రాంపండు గుమ్మం వైపుకు నాలుగడుగులు పరుగెత్తి ఆగి, బుజం మీదనుంచి 'బాగా అయిందా' అన్నట్లు చూసి పరుగెత్తుకుపోయాడు. ఇదేమిటి, కుర్రవాడు చూస్తే ఇంత ముద్దుగా ఉన్నాడు, కాని ఇంత పెంకెగా ఉన్నాడే

## ★ చిన్ని పరీక్ష ★

అనుకుంది. ఆమెకు భయంవేసింది ఎవరేనా గిట్టనివాళ్లు తనపట్ల రాంపండు మనసు విరిచారేమోననీ, తాను కొట్టాననీ తిట్టాననీ చెప్పి భయం కలిగించారేమోననీని. సవతి తల్లి అంటేనే లోకందృష్టిలో బిడ్డల నేడ్పించుకు తినేదనే. ఇలా తలచుకునేసరికి సావిత్రి హృదయంలో అభిమానమూ, పట్టుదలా పెరిగాయి. రాంపండు తనవాడు. తనకూ వాడికీ మధ్య రావడానికి ఇతరుల కేమధికారముంది? తాను అందరు సవతి తల్లులవంటిదానను కానని ఋజువు పరచుకోవాలని నిశ్చయం చేసుకుందామె. తన భర్త ప్రేమలో ఆమె కెటువంటి సందేహమూ లేదు. అటువంటి భర్త తనకు లభించినందుకు తన అదృష్టాన్ని తానే పొగడుకుంది. రాంపండు చిన్ని హృదయం కూడా తనదిగా చేసుకుంటే తనకు కావలసినది మరేముంటుంది?

మనుగుడుపుల తర్వాత సావిత్రి పుట్టింటికి వచ్చిందని మాటేకాని ఆమెమనస్సు తాను చేయబోయే కాపురాన్ని గురించి ఆలోచనలతోనే నిండిపోయింది. రాంపండు దుబ్బు జుట్టూ, కళ్ళూ, బుగ్గలూ అన్నీ అస్తమానూ ఆమె కళ్లముందాడసాగాయి. ఎప్పుడు తన సొంతకాపురం చేస్తానా, ఎప్పుడు రాంపండును తనివితీర ముద్దాడుతానా అనే ఉత్కంఠ సిగ్గువల్ల బయటికి వెలువరించలేక హృదయంలోనే అణచిపెట్టుకుంది సావిత్రి. ఒక నెలతర్వాత ఒక రోజున కామేశ్వరరావు భార్యను తీసుకువెళ్లడానికి వచ్చాడు. తల్లీ తండ్రీ తగు విధంగా సారెలతో చీరెలతో కూతురిని కొత్తకాపురానికి పంపించారు.

సావిత్రికి అత్తగారి బాధలంటూ లేవు. ఎందుకంటే అత్తగారూ వాళ్ళూ మరొక ఊళ్ళో ఉన్నారు. ఇక్కడ తాను సంపూర్ణ స్వేచ్ఛ ననుభవించవచ్చు. కామేశ్వరరావు తీసుకున్నది ఒక శుభ్రమైన వీథిలో ఒక చక్కని చిన్న డాబా. తిరిగి వచ్చినతర్వాత కూడా కామేశ్వరరావు మరి రెండురోజులు సెలవుపెట్టి సావిత్రిని బజారుకూ అక్కడకూ తీసుకువెళ్లి ఆమెకు కావలసిన చీరలూ వగైరాలూ, ఇంట్లోకి కావలసిన వస్తువులూ అన్నీ కొనితెచ్చాడు. ఇల్లంతా ఆమె అభిరుచికి అనుగుణంగా అలంకరించాడు. ఇంట్లో పనుల్లోకూడా సావిత్రి వద్దంటున్నా సాయపడ్తున్నాడు. భర్త అలా తనప్రక్కన పనిచేయడం ఆమెకు సిగ్గుగా ఉన్నా లోలోపల పొంగుతున్న ఆనందంవల్ల గట్టిగా కాదనలేకపోతోంది. కామేశ్వరరావు రెండురోజులూ తనతోబాటు సినిమాలకు తీసుకువెళ్లాడు. కాని సావిత్రికి మొదట్లోనే ఒక పెద్దలోటు కనిపించింది. రాంపండు అక్కడ లేని లోటు. వచ్చీరావడంతోనే భర్త నడిగింది రాంపండు ఏడని.

"అమ్మమ్మగారింట్లో ఉన్నాడ"న్నాడు కామేశ్వరరావు.

"ఇక్కడ సొంత ఇల్లుండగా అక్కడ ఉండడమేమిటి?" అని అడిగింది సావిత్రి.

"వాడి కిక్కడ కొత్తగా ఉండవచ్చు. అక్కడే ఉంటే బాగుంటుంది" అన్నాడతను ఆమెకేసి పరీక్షగా చూస్తూ.

"ఊఁహూఁ. రాంపండు ఇక్కడే ఉండాలి. నేనుండగా మరొకరిని పెంచనీయను?"

తన కొడుకుపట్ల సావిత్రి కున్న అభిమానం చూసి కామేశ్వరరావు హృదయం సంతోషంతో నిండిపోయింది. అతని కదివరకున్న కొన్ని అనుమానాలు కూడా తొలగిపోయాయి. "వాడి అమ్మమ్మగారు కొద్దిరోజు లుంచుకు పంపిస్తామంటేనే పంపాను. నీవు రాకముందే వాడిని పంపించివేయవలసినదిగా వాళ్లకు ఉత్తరం రాశాను. నీవు ఏమంటావో చూదామని ఇంతవరకూ చెప్పలేదు" అన్నాడతను చిరునవ్వుతో.

మర్నాటి మధ్యాహ్నం కామేశ్వరరావు మొదటి అత్తవారి ఊరునుంచి ఒక బంధువు రాంపండును తీసుకువచ్చి దిగబెట్టి వెంటనే తిరిగి వెళ్లిపోయాడు. సావిత్రి రాంపండును ముద్దుగా దగ్గరకు పిలిచింది. కాని వాడు మూతి ముడుచుకొని, మిడిగుడ్లు చేసుకొని, బెదరింపుగా వేలాడించాడు. వాడి బెదరింపు చూస్తే సావిత్రికి నవ్వు వచ్చింది. కాని అప్పుడే ముద్దుపెట్టుకుంటే మళ్లీ కరుస్తాడేమో నని భయంవల్ల మెల్లగానే చనువు చేసుకోవాలనుకొని అప్పటికి వాడిదగ్గరకు పోలేదు. రాంపండు కాసేపు ఇంట్లో తన సామానన్నీ చూసుకొని, తర్వాత తన బొమ్మ కుక్కపిల్లా, బొంగరమూ తీసుకొని వీధిలోకి పరుగెత్తి తన పాతస్నేహితులని కలుసుకొని ఆటల్లో మునిగిపోయాడు.

సాయంత్రం తండ్రి రావడం చూసి రాంపండు ఇంటికి పరుగెత్తుకు వచ్చాడు. కామేశ్వరరావు కొడుకును చూసి ఎత్తుకొని, ముద్దాడి లోపలకు తీసుకువెళ్లాడు. సావిత్రి నెత్తుకు మల్లెపూల పొట్లం విసిరి "ఇదుగో నీ గారాబుకొడుకు, సావిత్రీ. వీడికి ముందు అన్నం పెట్టు. నాకింకా ఆలస్యముంది. ఆట్టే ఆలస్యమయితే వీడు నిద్రపోతాడు. తరువాత మన మిద్దరం తినవచ్చులే" అన్నాడు. సావిత్రి అలాగేనని వంట తరువాయి చూడసాగింది. కామేశ్వరరావు కొడుకును దొడ్లోకి తీసుకుపోయి కాళ్ళూ చేతులూ శుభ్రంగా కడిగి "ఇప్పు డమ్మదగ్గరకు వెళ్లి, అన్నం తిని పడుకో, నాన్నా" అని పంపి తానుకూడా కాళ్లూ చేతులూ, మొగం కడుగుకొని, దుస్తులు మార్చుకొని తనపని చూసుకోసాగాడు.

రాంపండు మెల్లగా వంటింట్లోకి నడిచాడు. సావిత్రి పీట వేసి కంచం పెట్టింది. వాడు పీటమీద కూర్చున్నాడు. సావిత్రి అన్నం వడ్డించి "నేను కలిపి పెట్టనా, రాంపండూ" అంది. రాంపండు మళ్ళీ మిడిగుడ్లు చేసుకొని "నువ్వు పో" అన్నాడు అధారిటీ చేస్తున్నట్లుగా బయటికి చేయి చూపిస్తూ. అయినా సావిత్రి దగ్గర కూర్చొని అన్నం కలపబోయింది. వాడు లేచి పోబోయాడు. "పోనీ, నువ్వే తినులే" అంటూ సావిత్రి పులుసుగిన్నే, నేతిగిన్నే కూడా వాడిదగ్గరే పెట్టి అవతలకు పోయి గుమ్మంలో నిల్చొని చూడసాగింది. కాని రాంపండు అన్నం కలుపుకోలేదు. సావిత్రికేసే చూస్తూ కూర్చున్నాడు. తా నెదురుగా ఉంటే తినడేమోనని తలుపులు జేరవేసి తలుపుసందులోనుంచి చూడసాగింది సావిత్రి. ఇప్పుడామె చూడడం లేదుకదా అనుకొని రాంపండు భోజనానికి ఉపక్రమించాడు. మొదట్లోనే పులుసు పోసేసుకున్నాడు. నేతిగిన్నెలో నెయ్యంతా వంచేసుకున్నాడు. బాగా కలపకుండానే మొత్తం బొక్కివేయసాగాడు. సగం తిని, మిగతాది ప్రక్కకు తోసివేసి, మిగిలిన అన్నంలో కూర కలుపుకున్నాడు. అది కూడా బాగా కలుపుకోలేక అలాగే తినసాగాడు. వాడి తిండివరస చూస్తే సావిత్రికి నవ్వూ వస్తోంది, ముద్దూ వస్తోంది. ఇప్పటినుంచీ వీడి కింత స్వతంత్రబుద్ధేమూ అని. ఆ చిన్ని చేతులతో పూర్తిగా కలపని అన్నం తినడానికి తీసుకుంటూంటే సగం క్రిందే పడిపోతోంది. మిగిలినదైనా పూర్తిగా నోట్లోకి పోవడంలేదు. మూతితో బాటు ముక్కు కూడా భోంచేస్తున్నట్లుంది.

చొక్కానిండా, పీటమీదా, కంచం చుట్టూ మెతుకులే! అలాగే ఆ కూర అన్నం కొంత తిని, తల ఎత్తి చూసి, "పెలుగు!" అని గట్టిగా అరిచాడు రాంపండు. చిన్ని రాజుగారి ఆజ్ఞ వెంటనే శిరసావహించకపోతే ప్రమాదమని సావిత్రి త్వరగా పెరుగు గిన్నె తీసుకువెళ్ళి వాడి కంచంలో పోయసాగింది. ఎంతకీ వాడు చాలనడం లేదు. సావిత్రే వాడికి తగినంత పోసి గిన్నె ప్రక్కనుపెట్టి వచ్చింది. రాంపండు పెరుగు అన్నం జుర్రడం హడావుడిలో ఉన్నాడు కాబట్టి సావిత్రి అక్కడే నిలబడిఉండడాన్కి ఈసారి అభ్యంతరపెట్టలేదు. సావిత్రి మెల్లగా అంది: "ఏం, నాన్నా. నేనంటే ందు కింత కోపం. నేను నిన్నెప్పుడైనా గానా, తిట్టానా. నే నెవరో నీకు తెలిమా?" రాంపండు పెరుగుఅన్నం చేతి తీస్తూ "నువ్వెవలూ" అని ప్రశ్నించాడు పెద్ద జడ్జీగారిలా ముఖంపెట్టి. "నేను మీ అమ్మనే, రాంపండూ" అంది సావిత్రి ఆనందంతో గొంతుక మూసుకుపోతూండగా. రాంపండు నోటిదాకా తెచ్చుకున్న చెయి కంచానపెట్టికొట్టి "నువ్వు మాఅమ్మవు కావు, దొం[illegible]వు" అనేశాడు. సావిత్రి కొయ్యబారిపోయింది. అప్పుడే అటు వస్తున్న కామేశ్వరరావు కూడా ఆమాటలు విని ఒక క్షణం నిర్ఘాంతపోయాడు. ఒక్కసారిగా ఒళ్లు మండుకువచ్చిందతనికి. లోపల కురికి "ఏరా వెధవా, ఎవరు నేర్పార్రా నీకీ మాటలు? మళ్లీ అనుచంపేస్తా"నంటూ వాడిని దబదబా వాయించసాగాడు. సావిత్రి కంగారుగా అడ్డుపడి రాంపండును చేతుల్లోకి తీసుకొంది. అయినా రాంపండుకు రెండు దెబ్బలు తగలనే తగిలాయి. వాడు పెద్దపెట్టున ఏడవసాగాడు. ఆ ఏడుపు చూసి కామేశ్వరరావు కోపం హరించుకుపోయి "ఈసారెప్పుడూ అలాంటి మాట లనకేం అమ్మని. అమ్మ ఎలా చెపితే అలా చేస్తూండు, తెలిసిందా. జాగ్రత్త" అని బెదరించి వెళ్లిపోయాడు. సావిత్రి రాంపండు నోదార్చి, వాడి ఏడుపు కాస్త తగ్గిన తర్వాత మళ్ళీ పీటదగ్గర కూర్చోబెట్టి మిగిలిన అన్నం పెట్టబోయింది. కాని వాడు చేయి తోసివేశాడు. ఇక లాభం లేదని, వాడి ఒళ్ళు దులిపి, చెయ్యీ మూతీ కడిగి, తీసుకువెళ్లి మంచంమీద పడుకోబెట్టి, జోకొట్టి వచ్చింది. సావిత్రికి పెద్ద భయం పట్టుకుంది భర్త తనపక్షాన మాట్లాడి రాంపండును కొట్టడంవల్ల వాడికి తనమీద కోపం పెరిగి తనకు దూరమవుతాడేమోనని. అందుకే భర్త భోజనం చేస్తూండగా అంది: "ఎందుకండీ, రాంపండును అలా కొట్టారు?" అని. "అదికాదు సావిత్రీ, ఇలాంటి మాటలంటూంటే ఊరుకోకూడదు. ఎవరో నేర్పినట్టున్నారు ఈ మాటలు" అన్నాడు కామేశ్వరరావు ఆమాట తలచుకొని మళ్లీ కోపం వస్తూ. "అదంతా నేను చూసుకుంటానుగా. వాడిని నాకు పూర్తిగా విడిచిపెట్టండి. ఇక ముందు మీ రెన్నడూ రాంపండుమీద చేయి చేసుకోనని మాట యివ్వండి" అంది సావిత్రి భర్తకేసి స్నిగ్ధంగా చూస్తూ. కామేశ్వరరావు ఒక నిమిషం సావిత్రికేసి చూశాడు. చిరునవ్వుతో అన్నాడు. "నేను మాత్రం వాడిని కొట్టగలనా? వాడి నోటంట అలాంటి మాట వచ్చిందని కొట్టానుకాని. వాడు నీవాడే లే. నీ యిష్టంవచ్చినట్లు చూసుకో."

మర్నాడు ప్రొద్దున్న రాంపండు లేచేసరికి కామేశ్వరరావు అడిగాడు: "ఏరా



దీక్ష —యస్. వి. జోగారావు, కాకినాడ.

# ★ చిన్నిపరీక్ష ★

నాన్నా, ఈవేళ బడికి వెళ్తానా?" "వెళ్తాను నాన్నా" అన్నాడు రాంపండు ఉత్సాహంతో రాత్రి దెబ్బలప్పుడే మరచిపోయి.

"అయితే దొడ్లోకి పోయి మొగం కడుగుకొనీ, అమ్మచేత నీళ్లు పోయించుకునీ, అన్నంతిని వెళ్లు" అన్నాడు తండ్రి.

రాంపండు బుర్రఊపి దొడ్లోకి పోయాడు.

సావిత్రి వేడినీళ్లు కాచి రాంపండుకు పోద్దామని, బిందెలో తోడుకొని తీసుకుపోబోతూంటే దొడ్లోనుంచి ఏడుపు వినిపించింది. సావిత్రి కంగారుగా బిందెతో పరుగెత్తింది. రాంపండు తనకుతానే నూతిదగ్గర చన్నీళ్లు పోసేసుకుంటున్నాడు. మొగమంతా సబ్బు రుద్దుకున్నాడు. నురగ కంట్లోకి పోయి కళ్లుమండి ఏడుస్తున్నాడు. "ఇదేంపని, రాంపండూ, నేను వస్తున్నానుగా" అని సావిత్రి దగ్గరకు పోయి మొగం కడగబోయింది. రాంపండు చేతితో ఆమెను తోసివేశాడు. "అయితే మీ నాన్నను పిలవనా" అంది సావిత్రి. వాడు మళ్లీ మాట్లాడలేదు. సావిత్రి వేడినీళ్లతో మొగంమీద నురుగు కడిగివేసి, శుభ్రంగా నీళ్లుపోసి, బట్టలు తొడిగి, వద్దిఅన్నం పెట్టింది. వాడు తన పలకా, బలపమూ తీసుకొని తండ్రి దగ్గరకు పోయి "బడి కెల్తున్నాను, నాన్నా" అన్నాడు. "వెళ్లిరా, నాన్నా" అంటూ కామేశ్వరరావు వాడిచేతిలో ఒక కానీ పెట్టాడు. వాడు హుషారుగా గంతులు వేసుకుంటూ పరుగెత్తుకు పోయాడు.

సావిత్రి ఆఫీసువేళకు భర్తకు భోజనం పెట్టి, తను భోజనంచేసి, రాంపండు బడినుంచి వచ్చినతర్వాత అన్నం పెట్దామని వంటింట్లో పీట, కంచం పెట్టివచ్చింది. పదకొండయినా రాంపండు రాలేదు. బడి విడిచి చాలాసేపయి ఉంటుంది, ఇంతవరకూ రాలేదేమా అని ఆదుర్దా పడసాగింది. పన్నెండయింది. రాంపండు రాలేదు. "ఎక్కడికైనా పారిపోలేదుకదా. ఎటైనా పోతే వాడికి దారేమి తెలుస్తుంది? ఏ బండి క్రిందకో పరుగెత్తితే –" సావిత్రి గుండె దడదడ కొట్టుకోసాగింది. పోనీ ఇరుగు పొరుగుల నెవరినైనా అడుగుదామంటే సిగ్గువల్ల ఆమెకింకా వాళ్లతో బాగా పరిచయమేర్పడలేదు. మరి కొంతసేపటికి ఇక ఉండలేక సావిత్రి ఎలాగో ధైర్యం తెచ్చుకొని ప్రక్క యింటావిడ నడిగింది రాంపండు వాళ్లింటికి వచ్చాడేమో నని. రాలేదని చెప్పిందావిడ. "కంగారెందుకమ్మా. కడుపులో కాలితే వాడే వస్తాడులే" అంది ఆవిడ. సావిత్రి ఇంటికి తిరిగి వచ్చింది. మరొక అరగంట చూసినా వాడు రాకపోగా మళ్లీ ప్రక్కయింటావిడ దగ్గరకు పరుగెత్తింది. వాళ్ల పిల్లల నెవరినైనా పంపి రాంపండును వెదకి తెప్పించమని బతిమాలింది. మీకు పుణ్యముంటుందండి. "ఎందుకమ్మా, అంత కంగారుపడతావు. మా పిల్లాడు ఇంట్లోలేడు. వాడు వచ్చినతర్వాత పంపుతానులే" అంది ఆవిడ. సావిత్రికి ఇంట్లో ముళ్లమీద కూర్చున్నట్లుంది. మళ్ళీ పరుగెత్తింది ప్రక్కయింటావిడ దగ్గరకి. ఆవిడ తన కొడుకును రాంపండును వెతుక్కరమ్మని పంపింది. ఆ కుర్రవాడు తిరిగి తిరిగి వచ్చాడు. రాంపండు ఇంకొకరి యింట్లో వాళ్ళ కుర్రవాడితో బాటు అన్నం తిని, అక్కడినుంచే బడికి వెళ్ళిపోయాడనీ, ఇప్పుడు బడిలో ఉన్నాడనీ అతను చెప్పాడు. సావిత్రికి ఏమీ తోచలేదు. ఇంటికి తిరిగి వచ్చింది. ఆమెకు చాలా నిరాశ కలిగింది. రాంపండును తన వాడిగా చేసుకోవడంలో తా నోడిపోతానేమో ననిపించసాగింది. ఎన్నివిధాల ప్రయత్నించినా రాంపండు చనువు కావడంలేదు. మరెలా వాడిని చనువు చేసుకోవడం? ఈ ఆలోచనలో పడి సాయంత్రంవరకు గడిపింది.

సాయంత్రం ఇంటికి రాకపోతే తండ్రి కోపపడతాడేమో నన్న భయంతో రాంపండు బడినుంచి తిన్నగా యింటికి వచ్చాడు. "మధ్యాహ్నం ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగింది సావిత్రి. రాంపండు వేలు కొరుక్కుంటూ ఏమీ జవాబీయలేదు. "ఇంకెప్పుడూ అలా వెళ్లకేం. మీ నాన్నకు తెలిస్తే కొట్టేస్తారు. ఇంకెప్పుడూ వెళ్లవుకదూ" అంది సావిత్రి. వాడు భయంగా చూస్తూ తలఊపాడు. సావిత్రి భర్తతో మధ్యాహ్నం రాంపండు ఇంటికి రాకుండా, ఇంకొకరి యింట్లో అన్నం తిన్న సంగతి చెప్పలేదు – చెపితే భర్త రాంపండు నేమిచేస్తాడో అని భయమూ, తన అసమర్థతకూడా బయటపడుతుందనే సంకోచమూ రెండూ పీడించడం వల్ల.

మర్నాడు మధ్యాహ్నం రాంపండు బడినుంచి తిన్నగా యింటికే వచ్చాడు అన్నం తిన్నాడు. సావిత్రి వంటింటికి గొళ్లెం పెట్టి వీధిగదిలోకి వచ్చి లేసు అల్లుకుంటూ కూర్చుంది. రాంపండు ఇంట్లో అటూ ఇటూ తిరుగుతూ, కుక్కపిల్లతోనూ, బొంగరంతోనూ ఆడుకుంటున్నాడు. కొంతసేపటికి వంటింటి గొళ్లెం చప్పుడయింది. సావిత్రి ఉలిక్కిపడి లేచి చూసింది. రాంపండు ఒక కుర్చీ తలుపుదగ్గరకు లాగుకొని దానిమీద నిలబడి కర్రతో గొళ్లెం పడగొట్టుతున్నాడు. మళ్ళీ వెనక్కి తిరిగి చూశాడు. సవతితల్లి కనిపించేసరికి కర్ర ప్రక్కన పడవేసి కుర్చీమీదనుంచి దూకివేశాడు. ఆ దూకడంలో కుర్చీతోబాటు ముందుకు పడ్డాడు. సావిత్రి "అయ్యో" అంటూ లేవదీయడానికి ముందు కురికింది. కాని రాంపండు త్వరగాలేచి సావిత్రిని తప్పించుకొని పరుగెత్తుకుపోయాడు. "ఏమీ చేయను, రాంపండూ, నీకేం కావాలో చెప్పు, నేను పెడ్తాను" అంటున్నా వాడు పరుగెత్తుకుపోయాడు. సావిత్రికి కొంచెం విసుగూ కోపంకూడా కలిగింది "ఏమిటీ పిల్లవాడు! ఎంత ప్రేమగా చూస్తూంటే అంత దూరంగా ఉంటున్నాడు!" కొంత బెదరింపుకూడా చూపాలేమో ననుకుంది. కన్నతల్లి మాత్రం కొడుకు నెప్పుడూ కొట్టకుండా తిట్టకుండా ఉంటుందా? తానస్తమానూ అమిత ప్రేమ ఒలకబోయడానికి ప్రయత్నించడమే పొరబాటేమో ననుకుంది. రాంపండు చాలాసేపటివరకూ ఇంటికి రాలేదు. బడివేళయ్యేసరికి బెదురుగా చూస్తూ లోపలికి వచ్చి పలకా, బలపమూ తీసుకొని పరుగెత్తుకు పోయాడు.

సాయంత్రం మామూలుగానే తిరిగి వచ్చాడు. సావిత్రి వంటింట్లో పనిచేసుకుంటోంది. వాడు వీధిగదిలో తండ్రి కూర్చునే డ్రాయరుముందు కుర్చీలో కూర్చొని కాసేపు తండ్రిలా ఉండాలనే కోర్కె తీర్చుకోసాగాడు. పుస్తకాలన్నీ తీసి తెలిసినవాడులా కాగితాలు తిరగవేయసాగాడు. కాసేపటికి విసుగు పుట్టింది కాబోలు, బల్లమీద ఉన్న చక్కని 'పేపర్ వెయిట్' చూసి అది జేబులో పెట్టుకున్నాడు. అదే సమయానికి సావిత్రి వంటపని పూర్తిచేసుకొని అటు వచ్చింది. ఆమెను చూసి వాడు పారిపోబోయాడు. భర్త దేదో వస్తువు వాడిజేబులో ఉండడం చూసి వాడిని "ఆగు, ఆగు, రాంపండూ" అని పిలిచింది. వాడు పరుగెత్తుతూనే ఉన్నాడు. ఆ వస్తువు క్రిందపడి పగిలిపోతుందేమోనని సావిత్రి వాడి వెనకాల పరుగెత్తింది. రాంపండు ఇక తను పారిపోలేనని తెలుసుకొని, గిరున వెనక్కి తిరిగి, చేతిలో బొంగరం సావిత్రిమీదకు గట్టిగా విసిరేశాడు. అది వెళ్లి సావిత్రి నుదుటికి కుడివైపున తగిలింది. సావిత్రి ఆగిపోయింది. బొంగరం ములికి గుచ్చుకొని రక్తం కారసాగింది. అప్పుడే కామేశ్వరరావు అటువచ్చి ఈ సంఘటన చూసి, కొడుకును రెక్కపుచ్చుకొని లోపలకు లాగుకువెళ్లి వీపుమీద దబదబా బాదేయడం మొదలుపెట్టాడు. సావిత్రి "అయ్యో, వదలండి, కొట్టకండి, అయ్యో" అంటూ ముందుకు పరుగెత్తి రాంపండు చుట్టూ తన చేతులుచుట్టి, తన వీపు అడ్డుపెట్టింది. కామేశ్వరరావు ఆగాడు.

"వెధవ! దుడుకుతనం హెచ్చయిపోతోంది. ఊరుకుంటే లాభంలేదు - ముందు వాడిని వదిలి నీవు రక్తం కడుక్కో" అన్నాడు. సావిత్రి రాంపండును పట్టుకొని కూర్చునే ఉంది. కామేశ్వరరావే త్వరగా ఒక సబ్బు తడిపి, రక్తం తుడిచి, సల్ఫానిలమైడు పౌడరద్ది కట్టుకట్టాడు. సావిత్రిఒడిలో రాంపండు కూర్చొని ఏడుస్తున్నాడు. "ఏడు, వెధవా" అంటూ మళ్ళీ ఉరిమాడు కామేశ్వరరావు. "అయ్యో, వాడి నేమీ అనకండి," అంటూ సావిత్రి రాంపండును మరింత దగ్గరగా దాచుకుంది. ఆమెకు భయం పెరగసాగింది: తనవల్ల రాంపండుకి దెబ్బలు తగులుతున్నాయి - వీటివల్ల వాడు తనకు మరీ దూరమైపోతాడేమో, తాను చివరికి అందరి సవతి తల్లులలాగే అయిపోతానేమో నని. రాంపండు తననుంచి దూరంకాకుండా ఉండాలని భగవంతుడిని ప్రార్థిస్తూ రాంపండును మరింత గట్టిగా గుండెలకు నొక్కుకుంది.

ఆరాత్రి రాంపండుకు జ్వరం వచ్చింది. ఇక సావిత్రికి గుండెల్లో గుండెలు లేవు. ఈ జ్వర మేమిచేస్తుందో! లోకమంతా తనను గురించి ఏమనుకుంటుందో! జ్వరంతో మూలుగుతున్న రాంపండును చూస్తూంటే ఆమెకు కన్నీరాగలేదు. రాంపండుపక్కనే కూర్చుంది. రాంపండు జ్వర తీవ్రతలో, "నాన్నా, కొట్టకు, నాన్నా" అంటూ పలవరిస్తున్నాడు. ఆ పలవరింపులు విని కామేశ్వరరావు నీరైపోయి రాంపండు తలవైపు కూలబడిపోయి తలనిమురుతూ "చిట్టి నాన్నను అనవసరంగా కొట్టాను, పాపిష్టి వాడిని" అనుకుంటూ తలవంచుకు కూర్చున్నాడు. కొడుకునుగురించి భర్తమనస్సులో ఏమి బాధపడుతున్నాడో అన్న ఆందోళన బయలుదేరింది సావిత్రికి. భార్యాభర్తలిద్దరూ రాత్రంతా జాగరణ చేశారు. పొద్దున్న కామేశ్వరరావు డాక్టరును తీసుకవచ్చాడు. డాక్టరు వచ్చి చూసి "ఏమీ భయంలేదండి. మామూలు జ్వరమే. రెండు రోజుల్లో తగ్గిపోతుందిలెండి" అని చెప్పి మందులిచ్చి వెళ్లాడు. అయినా వాళ్లకు ధైర్యం కలగడంలేదు. ఇరుగు పొరుగువాళ్లు కూడా కొందరు వచ్చిచూసివెళ్లారు. కామేశ్వరరావు ఆవేళ ఆఫీసుకు సెలవుపెట్టి రాంపండుదగ్గరే కూర్చున్నాడు. భార్యను పోయి వంటింట్లో పనిచేసుకురమ్మని బలవంతంమీద పంపాడు. సావిత్రి వంటింట్లోకి పోయి పనులు చూసుకొని నీళ్లుతోడి తెచ్చుకోవడానికి బావిదగ్గరకు వెళ్లింది. నీళ్లబిందె చంకలోకి ఎత్తుకుంటుంటేగా ప్రక్కదొడ్లో నుంచి గుసగుసలు వినిపించాయి. "ఆఁ— సవతితల్లి సవతితల్లేనమ్మా. ఆయనకు బాదస్తం కాని రత్నంలాంటి బిడ్డను నిక్షేపంగా అమ్మగారింట ఉంచక ఇక్కడ ఉంచడమేమిటి? ఇక్కడ ఏం సుఖపడతాడని? ఎంతఅయినా సవతి తల్లి కన్నతల్లి కాగలదా." ఆ మాటలు విని సావిత్రి కొంచెంసేపు స్తంభించిపోయింది. ఎలాగో బరువెక్కిన గుండెతో బిందె తీసుకువచ్చి లోపల దింపింది. ఆమె కేపనీ చేయడానికి తోచలేదు. లోపల బాధా, అవమానమూ కంఠంనిండా నిండిపోతున్నాయి. ఇరుగు పొరుగులంతా అప్పుడే తనను మామూలు సవతి తల్లిలాగే భావించివేశారు. తన భర్త కూడా అలాగే భావిస్తాడా? భావిస్తే ఇక తనకేముంది? గుండెలో జంకుతో మళ్లీ రాంపండుదగ్గరకు వచ్చి వాడి నుదుటిమీద చేయివేసింది. జ్వరం ఇంకా తగ్గలేదు. కామేశ్వరరావు కొంతసేపుండి పెద్ద నిట్టూర్పు విడిచి అన్నాడు: "ఈ జ్వరం తగ్గిపోగానే వీడిని వాళ్ల అమ్మమ్మగారింట దిగబెట్టివస్తాను, సావిత్రీ." సావిత్రి గుండె ఒక క్షణం ఆగిపోయింది. అనుకున్నంతా అయింది. భర్తదృష్టిలోకూడా తను మామూలు సవతితల్లే అయిపోయింది! భర్తకేసి దీనంగా చూసింది. ఒక్కసారిగా ఆమెకు ఏడుపు పొంగివచ్చింది. రాంపండుమీదకు వాలి వెక్కి వెక్కి ఏడవసాగింది. కామేశ్వరరావు ఆమె ఆవేశం చూసి విస్తుపోయాడు "ఎందుకేడుస్తావు, సావిత్రీ" అన్నాడు మెల్లగా మరేమనాలో తోచక. "మీరు కూడా నన్ననుమానిస్తున్నారా? మీ దృష్టిలో కూడా సవతి బిడ్డలపట్ల ప్రేమలేని సవతి తల్లినే అయిపోయానా" అంది రుద్ధకంఠంతో. "లేదు సావిత్రీ. నీవు వాడిమీద ఎంత ప్రేమ చూపుతున్నావో నాకు తెలియదూ. కన్నతల్లికన్నా కూడా ఎక్కువగా చూపుతున్నావు. కాని వాడిమనసుమాత్రం ఎందుకో నీమీద కుదిరినట్లు లేదు. అందుకే వాడిని అమ్మమ్మగారింటే ఉంచితే అందరికీ బాగుంటుం దనుకుంటాను," అన్నాడు కామేశ్వరరావు. "నా రాంపండును నాదగ్గరనుంచి తీసుకువెళ్లడానికి వీలులేదు" అంది గట్టిగా సావిత్రి రాంపండును మరింతగా కౌగిలించుకుంటూ. కామేశ్వరరావు మౌనంగా ఆమెకేసే కొంతసేపు చూశాడు. తరువాత "అలాగే సావిత్రీ, వాడిక్కడే ఉంటాడు" అన్నాడు.

రాంపండుకు జ్వరం సాయంత్రానికి తగ్గుముఖం చూపింది. మరునాటికి బాగా తగ్గింది. మూడోనాటికి మామూలుగా లేచి తిరగసాగాడు. ఇప్పుడు వాడు సావిత్రిదగ్గర ఇదివరకటికన్న చనువుగానే ఉంటున్నాడు. ఆమెను పేరుపెట్టి పిలవడం లేదు కాని, "అన్నం పెట్టు", "బట్టలు తొడుగు" అంటున్నాడు. ఆమె చెప్పినట్లు చేస్తున్నాడు. సాయంత్రం బయటికి వెళ్లేముందు సావిత్రి కానీయో, అర్ధణో ఇస్తుంటే అది తీసుకొని వెళ్తున్నాడు. కాని వాడు ఆమె

# ★ చిన్ని పరీక్ష ★

కేసి అదోరకంగా చూస్తూ పోతున్నాడు. ఆ చిన్ని కళ్లలో ఆ అసంతృప్తి చూసి సావిత్రి నివ్వెరపోతోంది. ఆ అసంతృప్తి పోగొట్టడ మెలా అని బాధపడుతోంది. రాంపండు ఇదివరకటికన్న చనువైనా ఆమె ముందు ఇంతవరకు ఒక్కనాడైనా నవ్వలేదు. ఉత్సాహంతో మాట్లాడలేదు. దగ్గర ఉంటూనే దూరంగా ఉండిపోతున్నాడు. వాడి చిన్ని హృదయం అర్థం చేసుకోవడ మెలా అని సావిత్రి మనస్సును మథించుకుంటోంది.

ఒకరాత్రి భర్త అడిగాడు: "రాంపండు ఇప్పుడు నీదగ్గర బాగా చనువయ్యాడు కదూ."

"అయ్యాడం"ది సావిత్రి. కాని ఆమెకు తెలుసు తాను రాంపండు హృదయంలో కన్నతల్లి స్థానం పొందలేకపోయానని. కాని ఆ విషయం చెప్పి భర్తముందు ఓటమి అంగీకరించడానికి అభిమానం అడ్డువచ్చింది.

కామేశ్వరరావు ఆమె మనసులోని ఆందోళన గ్రహించలేకపోయాడు. రాంపండువిషయంలో ఇక తను నిశ్చింతగా ఉండవచ్చుననుకొని "నా అదృష్టం కొద్దీ నువ్వు నాకు దొరికావు, సావిత్రీ" అన్నాడు.

ఆ పొగడ్త విని పొంగిపోయే బదులు సావిత్రి సిగ్గుతో కుమిలిపోయింది. తానా పొగడ్త కన్నివిధాలా తగితే ఎంత బాగుండును! అంటూ లోలోనే నిట్టూర్చింది.

ఇన్నాళ్ళూ రాత్రిళ్లు సరిగా నిద్రలేకపోవడంవల్లా, ఇంట్లో చాకిరీవల్లా సావిత్రికి కొంచెం బడలిక చేసింది. అయినా భర్తకు తెలియనీయకుండా మామూలుగానే వంట చేసి భోజనంపెట్టి పంపించింది. తాను మాత్రం భోజనం చేయలేకపోయింది. తల నొప్పితోపోయి మంచంమీద పడుకుంది. కొంతసేపటికి రాంపండు బడినుంచి వచ్చాడు. ఇల్లంతా తిరిగాడు. సావిత్రి ఉన్న గదిలోకి తొంగిచూసి ఆమె పడుకోవడం చూశాడు. మళ్ళీ ఇల్లంతా తిరిగాడు. తిరిగి మెల్లగా సావిత్రిగదిలోకి అడుగుపెట్టి "అన్నం పెట్టవూ" అన్నాడు. సావిత్రి మెల్లగా లేచివెళ్ళి వాడికి అన్నం పెట్టి, వంటింటి తలుపు జేరవేసివచ్చి మంచంమీద పడుకుంది. రాంపండు అటూ ఇటూ తిరుగుతూ ఆడుకుంటున్నాడు. కాని సావిత్రి అలా మాట్లాడకుండా పడుకోవడం వల్ల వాడికేదో లోటు తోచసాగింది. చివరకు కుక్కపిల్లను చంకక్రింద పెట్టుకొని మళ్ళీ సావిత్రి గదిలోకి వచ్చి కొంతసేపు ఆమెకేసే చూస్తూ నిలబడ్డాడు. సావిత్రి వాడి రాక గమనించింది. కాని ...

... చేస్తాడో చూదామని మాట్లాడకుండా చూస్తోంది. ఉండి ఉండి వాడు మెల్లగా ప్రశ్నించాడు: "నువ్వుకూడా అమ్మలా చచ్చిపోతావుకదూ." సావిత్రి నోరు తెరచుకొని ఉండిపోయింది. ఏం జవాబీయాలో కూడా తెలియలేదు. మనస్సు ఖాళీ అయిపోయినట్లైంది. రాంపండు కొంచెంసేపు చూసి చూసి వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు. సావిత్రికి పిచ్చెత్తినట్లై అలాగే ఉండిపోయింది. కొంతసేపటికి వంటింట్లోనుంచి ఏవో డబ్బాలు పడుతున్నట్లు చప్పుడై కంగారుగా అటు పరుగెత్తింది. రాంపండు కర్రపెట్టెమీద ముక్కాలిపీట వేసుకొని, దానిమీద నిలబడి బల్లల మీదనున్న డబ్బాలు అందుకోబోతున్నాడు. కొన్ని డబ్బాలు నేలమీద దొర్లుతున్నాయి. సావిత్రి రావడంచూసి రాంపండు ఒక్క దూకు దూకి పారిపోయాడు. సావిత్రికి ఆశ్చర్యంవేసింది వాడికి ఏంకావాలో అని. పోనీ తనకు చెప్పడేం? బహుశా వాడి తల్లి వాడికేదో అలవాటు చేసిందేమో, దానికోసం చూస్తున్నాడేమోనని తోచింది. అన్ని డబ్బాలు తెరచి చూడసాగింది. చివరకు ఒక డబ్బాలో ఎప్పటివో నాలుగు వేపుడు బియ్యం పలుకులున్నాయి మరొక డబ్బాలో అడుగున ఏదో కొంచెం నల్లగా మడ్డికట్టినట్లు కనిపించింది. సావిత్రి వాసన చూసింది. స్వల్పంగా వేరుశెనగపప్పు పాకం వాసన వేసింది. ఆమె కొంతసేపు ఆ డబ్బాలకేసే చూస్తూ నిలబడి, తిరిగి అన్నీ యథాస్థానాల్లో పెట్టివేసింది. తలకు ఒక రుమాలు గట్టిగా బిగించి చుట్టుకొని పొయ్యిలో మంటచేసింది. వేపుడు బియ్యం తయారుచేసి ఒక డబ్బాలో పోసిఉంచింది.

సాయంత్రం భర్త రాగానే ఎదురుగాపోయి "మీరు ఇప్పుడే పోయి ఒక సేరు వేరుశెనగకాయలు తెచ్చిపెట్టండి" అంది. "అలాగే తెచ్చిపెడ్తానులే, ఇప్పుడేమంత అర్జంటు" అంటూ కామేశ్వరరావు లోపలికి రాబోయాడు. "కాదండీ, ఇప్పుడే కావాలి" అంది సావిత్రి కామేశ్వరరావు ఆమె తొందరకు ఆశ్చర్యపోయినా, మారు మాట్లాడక అలాగే బజారుకువెళ్ళి వేరుశెనగకాయలు కొనితెచ్చాడు. సావిత్రి వెంటనే అవి ఒలిచి, వేయించి, బెల్లం పాకంపట్టి అందులోవేసి చిన్నచిన్న ఉండలుగా చేసింది. అవికూడా ఇంకొక శుభ్రమైన డబ్బాలో ఉంచింది.

మర్నాడు ప్రొద్దున్న రాంపండు మామూలుగానే బడికి తయారయ్యాడు. ...

తల దువ్వి చేయి పుచ్చుకొని "ఇలారా" అంటూ లోపలికి తీసుకువెళ్లింది. జేబు పట్టుమంది. జేబు పట్టాడు. కొన్ని వేపుడు బియ్యం పోసింది. రాంపండు ఆశ్చర్యంతో సావిత్రి మొగంలోకి చూశాడు. మెల్లగా చేయి చాపాడు. వేరుశెనగపప్పు పాకం ఉండ పెట్టింది సావిత్రి. వాడి మొగం విప్పారిపోయింది. అది తింటూ ఎగురుతుంటూ వెళ్ళిపోయాడు.

బడి విడిచినతర్వాత ఇంటికి తిరిగి వచ్చాడు. అన్నం పెట్టనా అంది సావిత్రి. "ఉహుఁ. ఇవి పెట్టు" అన్నాడు జేబూ, చెయ్యీ చూపిస్తూ. సావిత్రి నవ్వుతూ "అస్తమానూ తింటే మంచిది కాదు. నాన్నా" అంది. అయినా కొద్దిగా వేపుడు బియ్యం తెచ్చి వాడిజేబులో పోసింది. ఒక వేరుశెనగపప్పు పాకం ఉండ చిదిపి వాడి చేతిలో పెట్టింది. ఉయ్యాల ఊగుతున్నట్లు ఊగుతూ, అవి తింటూ రాంపండు అడిగాడు: "నిన్నేమని పిలవనూ?" అని. "అమ్మ అని పిలు, నాన్నా" అంది సావిత్రి ఆశతో. "చలే అమ్మ. ఇవ్వాలేం మా మాట్లారం ఆ-ల్ల పిల్లాడిని కొట్టేచారు. ఆడు ఈ-ంత పేద్దగా ఉంటాడు. ఆడు ఏడ్చేచాడు. మేం నవ్వేచాం" అంటూ తల తిప్పుకుంటూ, కాలి వ్రేళ్లమీద లేస్తూ ఎన్నో అర్థంలేని కబుర్లన్నీ ఉత్సాహంతో ఏకరువు పెట్టేస్తున్నాడు. ఇన్నాళ్లకు వాడు సరదాగా మాట్లాడడం వింది సావిత్రి. ఆనందం పట్టలేకపోతోంది. వాడిని చనువు చేసుకుందుకు ఇంత చిన్న కిటుకుందని ఇన్నాళ్లూ తెలుసుకోలేక పోయాననుకుంది. వాడిమీద ఏదో తన ప్రేమంతా ఒక్కసారి ఒలకబోసి ఉక్కిరిబిక్కిరి చేయబోయింది. వాడి చిన్న పరీక్ష నెగ్గడానికి తానిన్నాళ్లూ పడ్డపాట్లన్నీ జ్ఞాపకం వచ్చాయి రాంపండు మాటలూ చేష్టలూ చూస్తుంటే తను పడ్డ పాట్లు తలచుకుంటూంటే ఒక్కసారిగా ఆమెకు ఎందుకో నవ్వు పొంగి వచ్చింది. పకాలున నవ్వేసింది. ఆ నవ్వు ఆపుకోలేక పోతోంది. రాంపండు ఒక క్షణం తెల్లబోయి, మళ్ళీ ఆమె నవ్వుచూసి తానూ నవ్వడం మొదలుపెట్టాడు. వాడి నవ్వు చూసి సావిత్రి నవ్వు మరీ ఎక్కువైంది. సావిత్రి నవ్వుచూసి రాంపండు నవ్వూ ఎక్కువైంది.

నవ్వి నవ్వి సావిత్రి చటుక్కున వాడిని ఎత్తుకొని గుండెలకు అదుముకుంటూ వాడి మొగం, బుగ్గలూ, పెదవులూ అంతటా ముద్దులమీద ముద్దులు కురిపించసాగింది. వాడి బుగ్గలు కొరికేసినంత పనిచేసింది. కాని రాంపండు తిరిగి కరవలేదు సరికదా ఇదేదో బలే తమాషా ఆట అనుకుంటూ "గుల్లాం, గుల్లాం" అంటూ ఆమె చేతుల్లో ...

▲




# కోకిలమ్మ

చాట్ల శ్రీరాములు

కొమ్మనిలచి కోకిలమ్మ
కమ్మగాను పాడుచుండ,
సంతసమున సెలయేరులు
పొంగిపొరలి ప్రవహించును.

కొమ్మనిలచి కోకిలమ్మ
కమ్మగాను పాడుచుండ,
సరగునజను మృగములన్ని
ఆగి ఆగి వినుచుండును.

కొమ్మనిలచి కోకిలమ్మ
కమ్మగాను పాడుచుండ,
పరవశమున నాట్యమాడి
తరియించును మయూరములు.

కొమ్మనిలచి కోకిలమ్మ
కమ్మగాను పాడుచుండ,
త్యాగరాజ, జయదేవులు
పాడినట్లు అనిపించును.






# టామ్‌సాయర్ ప్రపంచ యాత్ర

మూలం మార్క్‌ట్వేన్

ఈ సీరియల్ టామ్‌సాయర్, హకల్ బెరిఫిన్ నవలలకు తరువాతి జరిగిన కథను తెలుపుతుంది "హకల్ బెరిఫిన్" నవలలో మాదిరిగానే నవలలో కూడా హకల్ బెరిఫిన్ అనే కుర్రవాడే కథ చెబుతాడు ఈ నవలలో టామ్‌సాయర్ అనే మరో కుర్రవాడూ, హకల్ బెరీఫిన్, వీళ్ళ స్నేహితుడైన జిమ్ అనే నీగ్రో ముఖ్యపాత్రలు. టామ్‌సాయర్‌కు ఎప్పుడూ ఏదో సాహసం చేస్తూనే వుండాలనీ, తన పేరు దేశదేశాల్లో మోగిపోతూ వుండాలనీ కోరిక. అందుచేత ఇదివరకు చేసిన సాహసాలతో తృప్తిపడక, కొత్తవాటికోసం ప్లాను వేస్తాడు కాని మిగతా వాళ్ళిద్దరూ అతని ప్లాన్లు అన్నిటినీ తోసివేస్తారు. ఏంచేయడానికీ పాలుపోకుండా వున్న సమయంలో, ఒక ప్రొఫెసరు బెలూన్‌లో యూరప్ ఖండానికి బయలుదేరనున్నట్టు వాళ్ళకి తెలుస్తుంది. అది చూసివద్దామని వెళ్ళిన టామ్, హక్, జిమ్ ముగ్గుర్నీ ప్రొఫెసరు లోపలికి రానిచ్చి హఠాత్తుగా బెలూన్‌ను బయలుదేరదీస్తాడు. యూరప్ ప్రయాణమై పోతున్న విమానంలో ముగ్గురు మిత్రులు నిర్ఘాంతపోయి కూర్చున్నారు. మార్గమధ్యంలో ప్రొఫెసరు తెగ తాగి సముద్రంలో పడి మరణిస్తాడు. బెలూన్ నడపడం టామ్ నేర్చుకున్నందున ప్రయాణం క్షేమంగానే సాగింది కాని విమానం యూరప్ పోవడానికి బదులు సహారా ఎడారిలో ప్రవేశించింది. తరవాత వారికొక వర్తకుల బిడారం ఎదురుపడింది. బిడారంమీద దొంగల గుంపు ఒకటి పడి ధనం దోచుకోడానికి ప్రయత్నించారు. కాని ఓడిపోయి పారిపోయారు. వర్తకులకు చెందిన ఒక శిశువును దొంగలనుండి మా ముగ్గురు స్నేహితులు రక్షించారు.

## 8

ఉదయమే భోజనాలు కానిచ్చి, ఎడారిలో ఏమైనా వింతలు కనబడతాయేమోనని చూస్తూకూర్చున్నాము. మేము ఆకాశంలో బాగా ఎత్తుకు పోకపోయినా, చల్లటిగాలే వీస్తోంది. ఎడారిలో సాయంత్రం కాగానే ఎంత కిందికి వస్తే అంత హాయిగా వుంటుంది. ఏమంటే సూర్యుడు అస్తమించగానే భూమి త్వరగా చల్లారిపోతుంది. అందుచేత రాత్రిలంతా నేలకు దగ్గిరగానే ప్రయాణం చేశాము.

బెలూన్‌నీడ నేలమీద జరజర ప్రాకిపోవడం చూస్తూ, అప్పుడప్పుడు చుట్టుప్రక్కల దూరంగా ఏమైనా కనిపిస్తాయేమో తలెత్తిచూస్తున్నాము. ఇంతలో అకస్మాత్తుగా మా బెలూన్ కింద నేలమీద బోలెడు మంది మనుషులు కనిపించారు. ఒంటెలుకూడా అనేకం

కనిపించాయి. అంతా నిశ్శబ్దంగా, నిశ్చలంగా, నిద్ర పోతున్నట్లు కనిపించారు.

విమానం ఆపుచేసి, వెనక్కి పోనిచ్చి, మనుష్యులకు సైగా ఆపి చూశాము. వాళ్ళందరూ చనిపోయి వున్నట్లు గ్రహించాము. ఒక్కసారిగా ఒళ్లు ఝల్లు మంది. నెమ్మదిగా విమానాన్ని బాగా కిందికి దింపాము. నిచ్చెన వేలాడవేసి నేనూ, టామ్ కిందికి దిగి మనుష్యుల మధ్యకు వెళ్లాము. ఎండకి ఎండిపోయి, నల్ల బడి, ముడతలుపడి వున్నాయి వాళ్ళశరీరాలు. లోపలి రక్తమాంసాలు లోపలే హరించిపోయి కేవలం ఆకారాలు మాత్రం మిగిలివున్నాయి. మగవారు, ఆడవారు, పిల్లలుకూడా వారిలోవున్నారు. వాళ్ళను చూస్తుంటే చనిపోయినవాళ్ళని అనిపించడంలేదు. నిద్ర పోతున్న వాళ్ళ మాదిరిగానే వున్నారు. కొందరు వెల్లకిలా చేతులుచాచుకుని పడుకునివున్నారు. కొందరు పక్కకి ఒరిగిపడుకున్నారు. ఇంకాకొందరు బోర్లా పడుకున్నారు. పళ్లవరుసలుమాత్రం కొంచెం వికృతంగా కనిపిస్తున్నాయి. అంతేగాని మిగతాదంతా సహజంగానే వున్నది. ఇద్దరుముగ్గురు కూర్చుని వున్నారు. వారిలో ఒకస్త్రీ వున్నది. ఆమెఒడిలో ఒక పసిపాప పడుకునివుంది. ఒకడు చేతులు మోకాళ్ళ మీద ఆనించి కూర్చుని ఎదురుగా చేతులుచాచి పడుకున్న ఒక యువతివంక చూస్తున్నాడు. అతనిచూపుల్లో విచారంకనిపిస్తోంది. అతని పొడుగాటిజుట్టు చెంపల మీద పడుతోంది. గాలి మెల్లిగా వీచినప్పుడల్లా జుట్టు కదులుతూ, అతడు తల కదిలిస్తున్నట్టు కనిపించి, భయంతో మేము వొణికిపోయాము. కొందరు మనుషులమీద, ఒంటెలమీద సగం సగందాకా ఇసుక పేరుకునివుంది. మిగతా కళేబరాలమీద ఇసుక లేదు. అసలు ఆ స్థలంలో ఇసుక చాలా తక్కువగా వుంది. నేలకూడా గట్టిగా వుంది. బట్టలు చాలవరకూ తూట్లు పడిపోయి శరీరాలు కొంతకొంత నగ్నంగా కనిపిస్తున్నాయి. ఒకగుడ్డముక్కను చేత్తోతీసి పట్టుకుంటే, పిండిపిండి అయిపోతోంది. ఆ మనుషులు కొన్ని సంవత్సరాలనుంచీ అలా పడివున్నారని టామ్ వూహించాడు.

కొందరు మనుషులదగ్గిర తుప్పుపట్టిన తుపాకులు, కొందరి దగ్గిరకత్తులు, మరి కొందరిదగ్గిర పిస్తోళ్లు వున్నాయి. ఒంటెల వీపుమీద మూటలింకా అలాగే వున్నాయి. కాని మూటల్లోని వస్తువులు చుట్టూ చెల్లాచెదురుగా పడివున్నాయి. ఆ మనుషులకు కత్తులతో ఇకపనేమీ వుండదుగదా అనిభావించి మేము తలావొక కత్తితీసుకున్నాము. కొన్ని పిస్తోళ్లు కూడా తీసుకున్నాము. అందంగా, డిజైన్లు చెక్కబడిన ఒకచిన్న పెట్టెనుకూడా తీసుకున్నాము. ఆ శవాలన్నిటినీ పాతిపెడదామనుకున్నాము. కాని పైన కప్పడానికి ఇసుక తప్ప ఇంకేమీ లేదు. ఇసుకను కప్పినా మళ్లీ ఎలాగూ ఎగిరిపోతుంది. పాపం, ఆ యువతిశరీరంమీదనైనా ఏదన్నా కప్పుదామని శాలువలు అవీ కప్పాము ఇసుక కూడా మీద పోద్దామనుకున్నాము కాని ఆమెవంకే చూస్తున్న ఆ మనిషిజుట్టు మళ్లీకదిలింది. అదిచూసి ఉలికిపడ్డాము. ఆ యువతిని కప్పివేయవద్దనీ, కప్పివేస్తే తానామెను చూడడానికి వీలుండదనీ మమ్మల్ని బతిమాలుతున్నట్టు అనిపించింది. అందుచేత ఆప్రయత్నం విరమించాము.

తరవాత విమానం ఎక్కి ప్రయాణమైపోయాము. కొద్దిసేపట్లో ఆ విచిత్ర శ్మశానవాటిక కనుమరుగైపోయింది. అంతమంది మనుషులు, అన్ని ఒంటెలు అక్కడ చనిపోయి ఉండడం ఎలా సంభవించిందోనని తర్కించాము. కానిఎంత తర్కించినా కారణం ఏమీదొరకలేదు. వారు దోవ తప్పిపోయివుంటారనీ, తిరిగి తిరిగి చివరికి వెంటతెచ్చుకున్న భోజన సామగ్రి అయిపోయి, మలమలమాడి ఆకలితో, దాహంతో మరణించి వుంటారని మొదట ఊహించాము. కాని అలాఅయితే క్రూరజంతువులేమీ వాళ్లను ముట్టుకోకుండా ఉండడం ఎలా సంభవిస్తుందని టామ్ ప్రశ్నవేశాడు. అందుచేత అది సరైనవూహ కాదనుకున్నాము. చివరికి ఏకారణమూ స్ఫురించలేదు. దాన్నిగూర్చి ఆలోచించడం మానివేశాము. కాని లోపల ఏదో భయంతో ఆందోళనతో దిగులుగా కూర్చున్నాము.

కొంతసేపైన తర్వాత మేము అక్కడనుంచి తెచ్చిన చిన్నపెట్టె తెరిచాము. దాన్నిండా నగలూ, రత్నాలూ ఉన్నాయి. వాటిని చూడగానే కళ్లు జిగేల్ మన్నాయి. ఇందాకటి ఆడవాళ్ల శరీరాల మీద కనిపించిన మేలిముసుగుల వస్త్రాలే మరికొన్ని ఆ

చిత్రమైన జరీపని వున్నది. 'ఈ ధనం మనకెందుకు, అక్కడే వదిలేసిపద్దామా' అనుకున్నాము. కాని టామ్ వద్దన్నాడు. "ఎడారిలో దొంగలు ఉంటారు. వాళ్లు

తనం చేయించిన పాపం మనకు తగలక తప్పదు. అందు చేత ఈ ధనం అక్కడ వదలివెయ్యవద్దు. మనవద్దనే ఉంచుకుందాము," అన్నాడు. దొంగలకు పాపంచేసే

అవకాశం బొత్తిగా లేకుండా ఇంకా వాళ్ళదగ్గిర మిగిలి వున్న సామగ్రి యావత్తూ వెంట తెచ్చుకునివుంటే బావుండేదని, అనుకున్నాను.

ఈలోగా గాలి బాగా వేడెక్కింది. వడగాలి తీవ్రంగా కొడుతోంది. మాకు ముగ్గురికీ ఒకసారే దాహం వేసింది. విమానంలోవున్న నీళ్లు తాగుదామని చూశాము. కాని ఆనీళ్లు పాడైపోయి, వాసన కొడుతున్నాయి పైగా నోరు పట్టనంత వేడిగా ఉన్నాయి. అవి మిసిసిపీనదినీళ్లే. అయినా తాగడానికి వీల్లేనంత పాడైపోయాయి.

కొంతసేపటిక్రితం ఆ శ్మశానంలో శవాలను పరిశీలిస్తున్నంతసేపూ లేని దాహం, విమానంలోకి రాగానే బాధ పెట్టసాగింది. తాగడానికి నీళ్లు లేవనగానే, దాహం ఒకనిమిషం క్రితంకంటే అయిదురెట్లు ఎక్కువైంది.

దూరదర్శినులు తీసుకుని చుట్టూరా చూస్తూండమని టామ్ మాతో చెప్పాడు. ఎక్కడైనా జలాశయం కనిపిస్తే కనిపించినట్టు, లేకపోతే మనపని ఆఖరు అన్నాడు. అలాగే చూస్తూ నుంచున్నాము. చేతులు, కాళ్లు నెప్పిపెట్టి ఇక నిలబడలేనిస్థితికి వచ్చాము. ఒకటి, రెండు, మూడు గంటలు గడిచినా ఇసకతప్ప ఎక్కడా జలాశయం కానరాలేదు. ఇసక, ఇసక, ఎక్కడ చూసినా ఇసకే. పైన ఎండ, కింద ఇసక. నరకయాతన అంటే ఇదే కాబోలనిపించింది. నేను ఇక నిలబడలేక కూలబడ్డాను.

కొంతసేపైనతర్వాత టామ్ సంతోషంతో కేకవేశాడు. ఎగిరి నుంచుని చూశాము. దూరాన సరస్సు కనిపించింది. చాలా పెద్దసరస్సు. గట్టుమీద చెట్లు, నీళ్లలో వాటినీడలు, చూడడానికి ఎంతో హాయి గొలిపాయి. సరస్సు చాలాదూరాన వున్నది. అయినా మాకు అదోలెక్క అనిపించలేదు. గంటకు వందమైళ్ళచొప్పున వేగం హెచ్చించాము. ఏడు నిమిషాల్లో అక్కడికి చేరుకోగలమని అంచనా వేశాము. కాని మేము ఎంతసేపు అలా పోయినా సరస్సు దూరమైపోతూనే వున్నది. ఒక్క అంగుళం కూడా దానిదగ్గిరికి మేము పోలేకపోయాము. ఇంతలో హఠాత్తుగా ఉన్నట్టుండి సరస్సు మాయమైపోయింది.

టామ్ ఆశ్చర్యంతో "అరె! అది ఎండమావి," అని కేకవేశాడు చేతికందిన నీళ్లు మాయమైనందుకు విచారపడక సంతోషపడతాడేమిటా అని నాకు అనిపించింది.

"దానిపేరు ఏదైనా కావచ్చును కాని అది ఏమయిపోయినట్టు?" అన్నాను.

జిమ్ వణికిపోతున్నాడు. భయంతో అతనికి ముచ్చెమటలు పోశాయి. టామ్ ఇలా సమాధానమిచ్చాడు: "ఏమైందని నన్నడుగుతావేం? ఏమైందో నువ్వు చూశావుగా?"

"అవును చూశాను. సరస్సు ఎక్కడికి పోయిందని?"

"హుక్! ఎక్కడికిపోవడమేమిటి? ఎండమావి ఎక్కడికి పోతుంది?"

"నాకు తెలియదు. అసలు ఎండమావి అంటే ఏమిటోకూడా నాకు తెలియదు" అన్నాను.

"ఎండమావి అంటే భ్రాంతి. భ్రాంతితప్ప ఇంకేమీ కాదు."

నాకీసారి నిజంగా కోపం వచ్చింది.

"టామ్‌సాయర్! నువ్వు ఇలా డబాయించి లాభంలేదు. నేను సరస్సు చూడలేదనుకున్నావా?"

"అవును, చూశాననుకుంటున్నావు?"

"అనుకోవడమేమిటోయ్? అనుకోవడాలు గినుకోవడాలు? నేను కళ్లారా చూస్తేనే?"

"నువ్వు చూడలేదనే నేనసేది. అక్కడ ఏదైనా వుంటేగా చూట్టానికి?"

టామ్ ఇలా డబాయిస్తుంటే జిమ్ తెల్లబోయాడు. విచారంగా ముఖంపెట్టి ఇలా అడిగాడు:

"టామ్‌గారూ! అలా అనకండి. మీ వేళాకోళాలకి ఇది సమయం కాదు. మీరూ, మేమూ అందరం అపాయంలో చిక్కుకుని వున్నాం. ఇప్పుడు మన ప్రాణాలు మనవి కావు. కాసేపట్లో దాహంతోగిలగిల కొట్టుకుని చచ్చిపోడానికి సిద్ధంగా వున్నాం. సరస్సు నేనుకూడా చూశాను. ఈ నిమిషంలో మిమ్మల్నీ, హక్‌నూ చూస్తున్నంత స్పష్టంగా నేను చూశాను"

"నువ్వూ, నేనేకాదు. టామ్‌కూడా సరస్సు చూశాడు. , అసలు ముందు దాన్ని చూసిందీ, మనతో చెప్పిందీ అతడేగదా?" అన్నాను నేను.

"అవును టామ్‌గారూ! మీరు కాదని లాభం లేదు. మనం అందరం చూశాం."

"చూస్తే? సరస్సు ఉన్నట్టేనా దాని అర్థం?" అన్నాడు టామ్.

"చూసింది ఒక్కడే అయితే, పోనీ వాడు తాగివున్నాడో, లేక కలగన్నాడో, లేక పిచ్చెక్కిందో అనుకోవచ్చు. పోనీ ఇద్దరుచూసినా అంతేనని తోసి పారెయ్యొచ్చు. కాని ముగ్గురు చూసినప్పుడు తాగి వున్నా, కలగంటున్నా, పిచ్చెక్కివున్నా అది నిజమే అవుతుందిగాని, తోసెయ్యడానికి వీల్లేదు," అన్నాడు జిమ్.

"నాకదేం తెలియదు. ఆకాశంలో సూర్యుడు ఒకదిక్కునుంచి ఇంకోదిక్కుకి తిరుగుతున్నాడని పూర్వం నాలుగువందలకోట్లమంది అనుకునేవాళ్లు. అంతమాత్రంచేత సూర్యుడు తిరుగుతున్నట్టేనా లెఖ్ఖ?"

"మరింకేమిటి టామ్‌గారూ? సూర్యుడు తిర క్కుండా ఆకాశమే తిరుగుతోందంటూరా? అసలు దాంట్లో అనుమానించవలసినంత పనేముచ్చిందో నాకు తెలియడంలేదు. అదుగో చూడండి. సూర్యుడు పొద్దున ఎక్కడున్నాడో, ఇప్పు డెక్కడున్నాడో?"

టామ్ నాకేసి తిరిగి "నువ్వేమంటావు హాక్? సూర్యుడు కదులుతున్నాడా?" అని అడిగాడు.

"టామ్! అంత తెలివితక్కువ ప్రశ్న అడగడం చూస్తే నాకు విచారంగా వుంది. కళ్లున్నవా డెవ డైనా సూర్యుడు తిరుగుతున్నాడనే అంటాడు."

టామ్ నిట్టూర్పువిడిచి "మీతో వాదించడం వృథా. 'ఓ అంటే నా' రాని ఇద్దరు చవటలతో ఈ మహాకాశంలో ఎలా ప్రయాణం చెయ్యడమో ఏమిటో తెలియకుండా వున్నది. మూడు నాలుగు వందలవేళ్ల కిందట యూనివర్సిటీ అధికారులకి ఎంత విజ్ఞానం వుండేదో మీకూ అంతే. అయితే హాక్‌ఫిన్! ఇదివరకు పోప్ లనబడేవాళ్లుండేవాళ్లు తెలుసా నీకు?" అని అడిగాడు.

"టామ్‌సాయర్! నువ్వు వాదించడం చేతగాక మమ్మల్ని అనవసరంగా తిడుతున్నావు."

"ఎవరు తిట్టేది?"

"నువ్వే."

"నేను తిట్టడంలేదు. మీలాంటి చవటల్ని పోప్‌లతో పోలిస్తే అది తిట్టడమవుతుందా? మిమ్మల్ని గౌరవించినట్లవుతుందిగాని? ఇంకా కోపంవస్తే పోప్‌కు రావాలిగాని మీకుగాదు. తమతో మిమ్మల్ని పోల్చినందుకు తిడితే వాళ్లు తిట్టాలిగాని మీరు కాదు."

"అయితే పోప్‌లవంటి గొప్పవాళ్లుకూడా తిడతారా?"

ఈ ప్రశ్న అడిగేసరికి టామ్‌కు హుషారెక్కింది. అక్కణ్ణించి ఇక ఉపన్యసించడం ప్రారంభించాడు. ఈ ఉపన్యాసంలో కొంత నాకు రాసిఇవ్వమని తర వాత టామ్‌ను అడిగాను. ఎందుకంటే ఆ ఉపన్యాస భాష పుస్తకాల్లో పాఠంలాగా వుంది. జ్ఞాపక ముంచు కోవడం కష్టమనిపించింది. టామ్ ఇలా అన్నాడు:

"అవును. పోప్‌లుకూడా తిట్టేవాళ్లు. అయితే మనవూళ్లో బెన్ మిల్లర్‌లాగా కాదు. బెన్‌మిల్లర్ వాడే మాటలే వాళ్లుకూడ వాడేవారు. కాని మాటల పొందిక వేరుగా వుండేది. ఎందుకంటే బెన్‌మిల్లర్ చదువుకున్నవాడు కాదు. విద్యావిహీనుడు. అందుచేత అతడితిట్లు అసంస్కృతములై వుండేవి. కాని పోప్‌లు గొప్పగొప్ప విద్వాంసులవద్ద విద్య అభ్యసించి తిట్లు తిట్టేవిధానం బాగా నేర్చుకునేవారు. శాస్త్రోక్తంగా, క్రమపద్ధతిలో తిట్టడం ఎలాగో వాళ్ళకి బాగా తెలుసు. గంభీరంగా, కఠినంగా, భయంకరంగా ఉండేవి వారి తిట్లు. బెన్‌మిల్లర్ తిట్టినప్పుడు మనం నవ్వుకుని మన దారిన మనం పోతాం. కాని పోప్‌లు తిడితే మహోప ద్రవం సంభవించినట్లు ఉండేది. రాజులుగాని, ప్రజలుగాని, మతద్రోహులుగాని, యూదులుగాని, ఎవరైనాసరే తమకి కోపం కలిగేట్లు ప్రవర్తించారంటే పోప్‌లు సహించేవారు కాదు. నానాశాపనార్థాలూ పెట్టేవారు. ఎలాపడితే అలా కాదు. దానికి ఒకపద్ధతి వుండేది. నఖశిఖపర్యంతం తిట్టేవారు. ఆమనిషిని దేశంనుంచి తరిమివేసి, వాడికి కూడూ గుడ్డా యిచ్చినవాణ్ణికూడా వెలివేసేవారు. అదీ తిట్టడం అంటే. వెధవది బెన్‌మిల్లర్‌గాడికేం తెలుసు తిట్టడం. మధ్య యుగాలరోజుల్లో పోప్ తిట్టా డంటే భూమి కంపించేది. రాజ్యాలు దద్దరిల్లేవి. రాజులు పాదాక్రాంతు లయ్యేవారు. ఆరోజుల్లో ఆఖరికి చచ్చురకం బిషప్ తిట్టగలిగినంత పాటికూడా ఈరోజుల్లో వాళ్లు తిట్టలేరు. అసలు తిట్టడం అనేది ఆరోజుల్లో ఒక గొప్పకళ. ఆ కళ ఇప్పుడు నశించి పోయింది."

 టామ్ సాయర్ ప్రపంచయాత్ర 

"అయితే ఇప్పుడుకూడా బిషప్‌లు తిడుతూ వుంటారా?" అని నేను అడిగాను.

"ఇప్పుడు వాళ్లు అట్టేతిట్టడం లేదనుకో. అయినా ఆ విద్య నేర్చుకుని వుంటారు. అది నేర్చుకోనివాడు ఆ వుద్యోగానికి పనికిరాడు."

"అయితే ఇప్పుడు తిట్టడం మానేసినట్లేనా వాళ్లు?"

"ఆ, చాలామటుకు మానేసినట్లే. కాని పెరూ లాంటిదేశాల్లో ఇంకా వారితిట్లు వినబడుతూనే వుంటాయనుకుంటాను. పెరూలాంటిదేశాల్లో ప్రజలు ఇంకా అమాయకంగానే వున్నారు. మధ్యయుగాల రోజుల్లో మిడతలకున్నపాటి తెలివి తేటలుకూడా ఈనాటి పెరూదేశప్రజలకి లేవు గనక ఆ దేశంలో అలాంటిది జరిగినా జరగివచ్చును."

"మిడతలా?"

"అవును. మధ్యయుగదినాల్లో ఫ్రాన్సుదేశంలో మిడతల దండు పొలాలమీద వాలి పైర్లను ధ్వంసం చేస్తుంటే బిషప్‌లు అక్కడికి వెళ్లి వాటిని శపించేవారు. యూదుజాతివాణ్ణో, మతద్రోహినో తిట్టినట్లే మిడతల్నికూడా తిట్టేవారు."

"మరి మిడతలేంచేసేవి?"

"నవ్వి వూరుకునేవి. ఏమీ వినబడనట్టు తమ దోవన తాము పైర్లను ధ్వంసం చేసుకుపోయేవి. ఆరోజుల్లో మిడతలకీ, మనుషులకీ ఉన్న పెద్దతేడా ఏమిటంటే మిడతలు చాలా తెలివిగా ప్రవర్తించేవి."

ఇంతలో జిమ్ "అరెరె. అదుగో, సరస్సు. మళ్లీవచ్చింది. అదుగో. టామ్‌గారూ! చూడండి. ఇప్పు డేమంటారు?" అని అరిచాడు.

జిమ్‌చూపినవైపు చూశాము. అక్కడ నిజంగానే సరస్సు వుంది. చెట్లు, నీడలు, అంతా ఇందాకటిలాగానే కళ్పించింది.

"టామ్‌సాయర్! ఇప్పుడు నీకు నమ్మకం కలిగిందనుకుంటాను," అన్నాను.

"అవును. అక్కడ సరస్సులేదని నాకు నమ్మకం కలిగింది."

"టామ్‌గారూ! మీరలా అంటూవుంటే నాకు భయం వేస్తోంది. ఎండ మాడ్చేస్తోంది. దాహంతో నాలిక పీక్కుపోతోంది. మీరు చూడబోతే మతిలేని మాటలు మాట్లాడుతున్నారు. అబ్బ. సరస్సు ఎంత బావుంది. అది చూస్తుంటే, ఎండిపోయిన నోట్లో కూడా నీళ్లూరుతున్నాయి," అన్నాడు జిమ్.

"ఇంకేం. అలా వూరిననీళ్లే మళ్లీ మింగి దాహం తీర్చుకో. అక్కడ సరస్సూలేదు, గిరస్సూ లేదు."

"జిమ్! జాగ్రత్తగా చూస్తూవుండు. అది ఎక్కడకు పోతుందో చూద్దాం,"అని హెచ్చరించాను నేను.

"అలాగే" అన్నాడు జిమ్.

మేము విమానంవేగం బాగా ఎక్కువ చేశాము. ఎంత తీవ్రవేగంతోపోతున్నా సరస్సు అంతవేగంతోనూ వెనక్కి పోతున్నట్లు కనబడింది. ఇంతలో అకస్మాత్తుగా సరస్సు మాయమైపోయింది.

(ఇంకా వుంది)

పొడవైన జుట్టు, మాసిపోయిన గడ్డంతో ఒకవ్యక్తి నడుస్తున్నాడు. ఒక కుర్రాడు అతని దగ్గరకొచ్చి "టైమెంతయిందండీ" అని అడిగాడు. ఆవ్యక్తి రిస్టువాచి చూసి "పది నిమిషాలు తక్కువ తొమ్మిది" అన్నాడు. "అయితే తొమ్మిది గంటలకి క్షవరం చేయించుకో" అంటూ పారిపోయాడు. అతనికి చాలా కోపం వచ్చింది. ఆ కుర్రాణ్ణి పట్టుకోడానికి తనూ పరుగెత్తాడు. మలుపు తిరిగే టప్పటికి పోలీసు ఎదురై పరుగెడుతున్న అతన్ని పట్టుకొని ఆపాడు. "ఏం అంత అర్జెంటు వ్యవహారం? మెయిన్ రోడ్డు మీద అడ్డంగా పరుగెడుతున్నావ్?" అనడిగాడు. అతడు రొప్పుతూ జరిగిందంతా చెప్పాడు. పోలీసు తన రిష్టువాచీ చూసి అన్నాడు. "అదేనా. ఇంకా ఎనిమిదినిమిషా లుందిగా. మంగలిషాపుకి అంత పరుగెట్టుకు వెళ్లితేగాని చేరుకోలేవా తొమ్మిది గంటలకి?"

ఎ. పి. రంగారావు.

# ఉ ష ఏ డు పు

- మా. వీ. -

ఉష వట్టి అల్లరిపిల్ల. ఇంట్లో ఒకటే ఆగంచేస్తుంటుంది. ఏ చిన్న విషయంలో కోపం వచ్చినా ఇంటికప్పు ఎగిరిపోయేట్లు గోలపెట్టి ఏడుస్తుంది. సంవత్సరాది పండగకని ఉష వాళ్ళఅమ్మ కొత్తగుడ్డలు కుట్టించింది. పండగ ఇంకా నాలుగు రోజులుఉన్నది. కొత్తగుడ్డలు చూసి ఉష చాలా మురిసిపోయింది.

"అమ్మా! అమ్మా! ఈ పూల గౌను చాలా బాగున్నది. తొందరగా నాకు తొడుగు" అని అడిగింది. అమ్మ మెల్లిగా చెప్పింది. "పండగ ఇంకా నాలుగురోజులు ఉన్నదికదా! పండగనాడు చక్కగా తలంటి పోసుకొని కట్టుకుందువు గానిలే. పెట్టెలో దాచుకో" అని.

ఉష చెప్పినమాట వినలేదు. "ఇప్పుడేతొడగాలి" అని మారాము చేసింది. అమ్మకు కోపంవచ్చింది. "అలావీలులేదు. నేను తొడగను. "పండగనాడు అందరూ కొత్త బట్టలు కట్టుకుంటారు. ఈగౌను కాస్తా ఇవాళే కట్టుకొని మాసేస్తే, ఆనాడు పాతబట్టకట్టుకుని తిరగవలసి వస్తుంది." అని చెప్పింది. అప్పటికీ ఉష వినలేదు. చేతులో ఉన్న గిలక్కాయలు నేలకేసి కొట్టింది. కాళ్లు దబదబ బాదుతూ వెళ్ళి, బల్లమీదఉన్న నాన్నగారి పుస్తకాలన్నీ క్రిందికి తోసింది. మంచంమీద పెట్టిఉన్న దిళ్లు, దుప్పట్లు ఒకటొకటే తీసిఇల్లంతా విసిరింది. అప్పటికీ అమ్మపట్టించుకోలేదు. క్రిందబడి ఈ ప్రక్కనుంచి ఆపక్కదాకా దొర్లింది. శోకాలు పెట్టి ఏడ్చింది. ఓ, ఓ అని పాలికేకలు పెట్టింది. ఒక్కొక్క కేకకు ఇంటికప్పు ఎగిరిపోతుందా అనిపించింది.

ఇలా ఉండగా, ఒక తమాషా జరిగింది. కొందరు కిన్నరులు-అంటే దేవతలలో ఒకజాతివారు - అలా తిరుగుతూ పోతున్నారు. వాళ్లు మనుష్యుల కంటికి కనిపించరు. పోతూఉండగా వారు ఉషఏడుపు విన్నారు. ఉష పెట్టున్న కేకలకు వాళ్ళచెవులు బద్దలయిపోయినాయి. ఒకరినొకరు చూసుకున్నారు. ఉష ఎందుకుఏడుస్తున్నదో వాళ్లు తెలుసుకున్నారు. ఉషచేస్తున్న మారాము చూసేనరికి వాళ్ళకి చాలా కోపం వచ్చింది. ఎలాగైనా ఈఅల్లరిపిల్లకు బుద్ధి వచ్చేటట్లు చేయాలని వాళ్లు అనుకున్నారు.

కిన్నరులు ఉష క్రిందపడి దొర్లుతూ, ఏడుస్తూ ఉన్న గదిలోకి మెల్లిగావచ్చారు. గదిలోని వస్తువు

# ★ ఉష ఏడుపు ★

లన్నీ అల్లరిచిల్లరగా పడిఉన్నాయి. తెల్లటిపక్కదుప్పట్లు నేలమీద పడి ఉన్నాయి. వాటిని ఇష్టంవచ్చినట్లు మాపుతూ, ఉష ఏడుస్తూ రాగాలు తీస్తున్నది. చీది, వాటికి తుడుస్తున్నది.

కిన్నరులు సరేఅంటేసరే అనుకున్నారు. అందరూ కలిసి ఉషను తల ఒకరు చేతులు ఒకరు, కాళ్లు ఒకరు ఇలా పట్టుకున్నారు. ఉష వాళ్ళని చూసింది. చూసి ఆశ్చర్యపోయింది. వాళ్లు తన్ను ఎక్కడికి తీసుకుపోతారో అని భయపడింది. పెద్దగా అరవాలనుకున్నది. కాని అరవలేకపోయింది.

చూస్తూ చూస్తూ ఉండగానే వాళ్ళయిల్లు మాయమై పోయింది. భయంతో కళ్లు మూసుకున్నది. మళ్ళీ కళ్లుతెరిచేసరికి ఉష ఒకకొత్త ఇంట్లోఉన్నది. చుట్టూ చూసింది. ఎవరూలేరు. కిన్నరులు దూరంగా ఇంటివెలుపల నిలబడి తమాషాచూస్తున్నారు. అప్పుడు ఉషకు తాను ఏడుస్తున్నట్లు గుర్తువచ్చింది. తనను అనవసరంగా కదిలించినందుకు వాళ్లమీద కోపం వచ్చింది. ఆ కచ్చతో మళ్లీ ఏడుపుఆరంభించింది. ఓ, ఓ అని అరవటం మొదలు పెట్టింది. అలా అరిచిందో లేదో పైకప్పుమీగనుంచి నాలుగు పెంకులుఎగిరి ఉషచుట్టూపడినాయి. ఉష అరవటం ఆపలేదు. మళ్లీ అరిచింది. మళ్ళీ నాలుగు పెంకులు ఎగిరి కింద పడినాయి. ఇలా ఉష ఏడుస్తూ బిగ్గరగా అరిచినప్పుడల్లా కప్పుపెంకులు ఎగిరి కిందపడటం ఆరంభించినాయి. అదీకనక తన నెత్తినే పడితే...! అయినా ఉష ఏడుపుఆపలేదు. కిన్నరులు బయట నిలబడి ఈతమాషాచూస్తూ పకపకనవ్వుతున్నారు.

కొంచెంసేపటిలో ఆ ఇల్లుకప్పు మొత్తం ఎగిరిపోయింది. చివరికి ఒకపెంకు ఉష మోకాటిపైన పడి కొంచెం దెబ్బతగిలింది కూడా. కిన్నరులు గబగబవచ్చి "బలేబలే! ఏడ్చు, ఏడ్చు, ఒకఇంటి కప్పుకప్పూ ఎగరగొట్టేశావే. చాలా తమాషాగా ఉన్నది. రా! రా! ఇంకోఇల్లు ఎగరగొట్టుదువుగాని" అంటూ ఉషను ఇంకోఇంటికి తీసుకెళ్ళారు.

ఈసారి పెంకులు క్రింద పడ్డప్పుడెల్లా చిన్నచిన్న దెబ్బలు తగలటం ఆరంభించినాయి ఉషకు భయంవేసింది — ఇంకా గట్టి దెబ్బలు తగులుతాయేమోనని. ఏడుపు ఆపివేసింది. కిన్నరులవంక చూచి, "ఇక ఏడవను. నన్ను మా ఇంటికి తీసుకుపొండి." అని బతిమిలాడింది. కిన్నరులు నవ్వుకున్నారు. "అలాకాదు. నీవు ఏడుస్తుంటే, ఇంటి పెంకులు పడుతుంటే మాకు చాలా తమాషాగా ఉంది. ఎలాగైనాఇంకో ఇంటికప్పుకూడా ఎగురగొట్టమ్మా" అని ఎగతాళిగా అన్నారు.

వాళ్లు తన్ను ఎగతాళి చేస్తున్నందుకు కోపంవచ్చింది ఉషకు. "మీరుఇలాగే ఎగతాళి చెయ్యండి. నాకుకోపంవస్తే ఏడుస్తాను." అంది. కిన్నరులు చెప్పారు. "నిన్ను ఏడవమనేగా మేము చెప్పిందికూడా. కోపంవస్తే వచ్చిందిలే చూద్దాం. కోపంవస్తే ఏంచేస్తావో"

ఉషకు చాలా కోపంవచ్చింది. పెద్దగా అరిచి ఏడుపు మొదలు పెట్టింది. దానితో పైనుంచి మరి నాలుగుపెంకులు-ఈసారి మీద పడినాయి. ఉషకు భయంవేసింది. "ఈసారి ఎంతకోపం వచ్చినాసరే ఏడవనుగాక ఏడవను" అనుకున్నది. కిన్నరులతో ఆమాటే చెప్పింది. ఉష ఇకమీదట మంచిపిల్ల అవుతుందని వాళ్ళకునమ్మకం కుదిరింది. అందుచేత వాళ్లు ఉషను అలాగే తెచ్చి ఇంటివద్ద దింపివేశారు.

ఉష అమ్మ వంటింట్లోపనిపూర్తి చేసుకొని తిరిగివచ్చేసరికి ఉష గదిలో కిందపడుకొని నిద్రపోతున్నది. అమ్మ ఉషను చూచి "ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది." అనుకున్నది. లేపి, మొగం కడిగింది. కడుగుతుండగా ఉష అమ్మతో చెప్పింది. "అమ్మా, ఇకమీద నేను ఎప్పుడూ ఏడవనే" అని.

సంవత్సరాది పండగ వచ్చింది. ఉష చక్కగా కొత్తగాను వేసుకున్నది. మధ్యాహ్నం అమ్మ చేసిన పిండివంటలు తిన్నది. ఇంకా కావాలని అడిగింది, అమ్మ "ఎక్కువగా తింటే కడుపులోనొప్పివస్తుంది. తినకూడద"ని చెప్పింది. ఉషకు కోపంవచ్చింది. మామూలుగా ఏడవబోయింది. పెద్దగాఅరుద్దామని నోరు తెరిచింది. కాని కిన్నరులు గుర్తువచ్చారు మళ్లా ఆఇళ్లకుతీసుకువెళ్తారేమోనని భయంవేసింది. ఏడుపు ఆపుకొని, నోరుమూసేసింది. ఉష ఏడవకుండా ఉన్నందుకు అమ్మ చాలా ఆశ్చర్యపోయింది.

"ఇదుగో ఇదితీసుకునిపో, ఇక అడగబోకు" అని ఇంకా కొంచెం పెట్టింది. అది తీసుకొని, ఉష ఆడుకోవటానికి పోయింది. ★

(ఆంగ్లకథ ననుసరించి)

# రామనామ మహిమ

పూర్వం దండకారణ్యంలో ఒక మహర్షి ఉండేవాడు. ఆయన తన తపోమహిమచేత అప్పుడప్పుడు స్వర్గలోకానికి వెళ్లివస్తూ ఉండేవాడు. ఆయనకు ఒక కుమారుడు. ఆ బాలుడు తన తండ్రికి శుశ్రూష చేస్తూ అన్నివిద్యలు నేర్చుకొన్నాడు. ఆ అరణ్యంలో ఉండే మునులందరూ ఆ బాలుని ప్రతిభను చూచి ఆశ్చర్యపోయేవారు.

ఒకదినం మహర్షి స్వర్గానికి వెళ్లిన సమయంలో ఆ బాలుడు ఒక్కడే ఆశ్రమముదగ్గఱ ఉండగా ఒకడు అక్కడకి పరుగెత్తుకొంటూ వచ్చి, "మహర్షి ఎక్కడ" అని ఆ బాలుని ప్రశ్నించాడు.

"మా నాన్నగారు లేరు. భగవద్దర్శనం కొరకు స్వర్గానికి వెళ్లారు" అని మునికుమారుడు తెలిపాడు. అది విని ఆ వచ్చినవాడు చాలా దుఃఖపడి తన్నుతాను నిందించుకోసాగాడు. అప్పుడు బాలుడు జాలిపడి "నీవు వచ్చినపని ఏమిటో నాకు చెప్పు. నేను చేయగలిగినదయితే చేస్తాను" అని చెప్పాడు. అతడు మరింత విచారపడుతూ "మునిపుత్రా! నేనువచ్చింది చాలా పెద్దకార్యము. నీ చేత కాదు" అన్నాడు

మునికుమారుడు అతనిని ఓదార్చుతూ తిరిగి తిరిగి ప్రశ్నించగా. "నాకు బ్రహ్మహత్యా దోషము తగిలింది. దాని నివారణార్థము నేను మీ తండ్రిగారి దగ్గఱికి వచ్చాను." అని అతడు తెలిపాడు.

"ఇంతేనా భయపడకు! నేను దానిని నివారిస్తాను నీవు పోయి నదిలో స్నానంచేసి శుచివైరమ్మ"ని మహర్షి పుత్రుడు అతనికి అభయ మిచ్చాడు. ఆ ఆగంతుకుడు శుచియై వచ్చిన తర్వాత అతనికి ఆ బాలుడు రామనామం ఉపదేశించి ఇలా చెప్పాడు.

"నిష్కల్మషమైన మనస్సుతో మున్మూరు ఈ మంత్రం జపించు నీపాపం నివారణ అవుతుంది."

**కష్టగంతుల రామకృష్ణ ప్రసాదు**

అతడు జపించగానే బ్రహ్మహత్యాదోషం తొలగిపోయింది.

ఇదిచూచి అక్కడఉండే మునులందరూ ఆశ్చర్యపోయారు. "పట్టుమనిపదహారేళ్లయినా లేని ఈ ముని పుత్రుడు ఎంత మహిమశాలి? తండ్రిని మించిన పుత్రుడు ఈ సంగతి తెలుసుకొని మహర్షి ఎంత సంతోషం పొందుతారు" అనుకొన్నారు.

స్వర్గలోకంనుండి మహర్షి తిరిగి వచ్చిన పిదప మునులవల్ల జరిగిన విషయం పూర్తిగా తెలుసుకొన్నాడు ఆయన సంతోషం పొందక పోగా చాలా మనస్తాపం చెందాడు. వెంటనే పుత్రుని పిలిచి ఇలా అన్నాడు.

"అయ్యో! అనవసరంగా ఎంత పని చేశావురా! "శ్రీరామ" అని ఒక్కసారి ఉచ్చరిస్తేనరిపోయేదానికి మూడుసార్లు చెప్పించావా? నీకింకా జ్ఞానోదయం కాలేదు. నీవు నీచకులంలో జన్మించి రాముని దర్శించి పాపపరిహారం చేసుకో."

ఆ శాపము ప్రకారం ఆ బాలుడు మరుజన్మలో "గుహుడు"గా జన్మించి శ్రీరాముని సందర్శించి, చేతయినంతసేవ చేసి తన జన్మ సఫలముచేసుకున్నాడు. ★

---

కాలేజీ విద్యార్థులంతా తమ సైన్సు ప్రొఫెసర్ గారితో గ్రామాలకి 'ఎక్స్‌కర్షన్' వెళ్ళారు. త్రోవలో ఒక మట్టియింటి గోడదగ్గరగా వెళ్ళి ఆశ్చర్యంతో ప్రొఫెసర్‌గారు అట్టే నిలచిపోయారు. వెంట వస్తూన్న విద్యార్థులు "ఏమండీ ప్రొఫెసర్‌గారూ! అలా గోడవైపే చూస్తూ నిలబడి పోయారేం?" అని అడిగారు.

"అదికాదు ఈఊరి పశువులు యిలా క్రమం తప్పకుండా ఈగోడమీద యీ విధంగా పేడ ఎలా వేయగలిగారో నని ఆలోచిస్తున్నా" అన్నారు.

జి. వి. రమణమూర్తి, చీరంపేట.

# ★ అపస్వరాలు ★

(12-వ పేజీ తరువాయి)

ఇంతలోనే, అబ్బాయి త్రయంబకరావు మొహం కడుక్కొని, ఆకలిమొహంతో వంటింట్లోకి వచ్చి గోడదగ్గిర కిటికీకింద, పెద్ద పీటమీద కూర్చుని, "రానీవే, రమణమ్మా, నాలుగిడ్లెన్లు రానీ" అన్నాడు.

"వూరికే గుర్రాలుతోలకు, వడ్డిస్తాలే వుండు. వండి వార్చటానికేగా ఇక్కడ వున్నది నేను' అన్నది రమణమ్మ—గొంతు స్థాయి కొంచెం పెంచి.

"ఏమిటే అది, పుట్టి పుణ్యానికి వాడిమీద అట్లా మండిపడతావు? రాత్రికూడా వాడు సరిగ్గా అన్నం తినలేదు సన్యాసి" అంది తల్లి, కొడుకుని వెనకేసుకొచ్చి.

"చాల్లే—" అంటూ మూతి విరుస్తూ రమణమ్మ నాలుగు ఇడ్లెన్లు కారప్పొడి నెయ్యివేసి, వెండిపళ్లెంలో పెట్టి తమ్ముడి ముందు, 'టక్' మని మోత వినపడేట్టు పెట్టి తిరిగి వెళ్లి పొయ్యిదగ్గిర కూచుంది.

త్రియంబకరావు ఇడ్లెన్లమీద పడ్డాడు. అతనికి ఇరవైరెండేళ్లుంటాయి. నాన్నగారికి మల్లేనే బాగా ఏపుగా పెరిగిన ఘటం. చిత్రగా దిబ్బపండు వన్నెలో వున్నాడు మనిషి. ముచ్చటైన వుంగరాల క్రాఫు; తీర్చిదిద్దిన ముక్కు మొహం తీరు కనీసం, 190 పౌన్లకు తక్కువ లేకుండాను. ఏ దిగులూ విచారమూ అతని దరికేనా రావు. ఎప్పుడూ తిండి గంధియే. రుచిగా శుచిగా బొజ్జనిండా తిని, కమ్మగా త్రేన్చి, వొంకలుపెట్టి, తన గదిలో ఈజీచేర్‌లో పడుకుని కునుకుతూ వుండడం అతని కెంతో ఇష్టం. ఎంత వన్నె వాడికెల శరీరమో, బుర్రమాత్రం అందుకు అంత వ్యతిరేకం; బందరులో, తెనాలి రెగిపిమున్న తప్ప మరోహాటి వుందనటానికి ఏలాంటి ఆధారమూ లేదు. అతని ప్రతి చర్యకీ తల్లో తండ్రో ప్రోద్బలం ఇవ్వాలి 'ఇలాగా, అలాగా' అని ఆలోచించి పెట్టాలి. ఎస్. ఎస్. ఎల్. సి మూడేళ్లా వరసగా తప్పి, మెట్రిక్కుకి ప్రయివేటుగా కూర్చుని, అందులోనూ, వాత్రీ తప్పకుండా పోలయి, ఇంక అతను చదవడం వొట్టి శరీరశ్రమ,తప్ప మరేమీ కాదని అతని గురువులూ, తల్లితండ్రులూ, అతనూకూడా నిర్ణయానికి రాక తప్పలేదు అయినా అతను చదివి సంపాయించాల్సిన అవసరమేమున్నది గనక? సుఖంగా కూర్చుని తింటూ, తల్లి కంట పడుతూ, ఉత్సవ విగ్రహంలా నిటుగా అలంకరించుకుని తిరుగుతూ వుంటే అంతేచాలు; తండ్రి వుద్దేశంకూడా అదే వాతే, ఈ మొద్దు అవతారాన్ని భరించలేనిది, రమణమ్మ మాత్రమే.

త్రియంబకరావు నాలుగు ఇడ్లెన్లూ నమిలేసి, "ఇంకో రెండేయ్యవ. చాలలేమో' అన్నాడు. "వేస్తున్నా" అంది అక్కడి నుంచే.

తల్లి, "వాడికి నేను కాఫీ అది ఇస్తాగాని, ఈ రసం నాన్నగారి కిచ్చిరా నువ్వు' అంది కూతురుతో.

"పంచదార వేశావుగదూ" అంటూ రమణమ్మ, వెండిగ్లాసు తీసుకుని విసురుగా వెళ్లిపోయింది. ఆఫీసురూంలో ప్లీడరుగారు లారిపోర్టర్ చదువుతున్నారు, అందులోవున్న ఓ జడ్జిమెంటు తనకెంతో కరంకంగా వుపయోగిస్తుందన్న ఊహతో. ఆయనకి కొంచెం దూరంలో, నేలమీద పరిచిన చాపమీద, గుమాస్తా సీతాపతి, శుచిగా, పిలక తడేనా ఆరకండా ముడేసుకుని విభూతిరేఖలు మొహాన మెరుస్తూవుంటే ఏదో అఫిడవిట్ కాయితంగావును రాస్తున్నాడు రాతబల్లముందు కూర్చుని. అతనికివనకా, రెండుపక్కలా, లాపుస్తకాలబీరువాలు పుస్తకాలతో క్రిక్కిరిసి వున్నాయి. ఓ దిన పత్రిక, అన్నీ సిరామిరకలతోనిండి పక్కనే పడివుంది. ప్లీడరుగారు అప్పుడప్పుడు, వేలంనోటీసులూ, కోరు ప్రకటనలనిమిత్తం కొన్ని పత్రికలు విధిగా చూడవల్సివుండడంవల్ల, వాటిని తెప్పిస్తూ వుంటాడు.

రమణమ్మ ఆఫీసుగదికీ ఇంట్లోకీ మధ్యవున్న వాకిలిదగ్గిర వేళ్లాడుతున్న తెర తొలగించి, "నాన్నా" అంది.

ప్లీడరుగారు, "ఎవరూ లేరులే. ఇట్లా వొచ్చి నాచేతి కియ్యి" అన్నాడు. ఆయన ధ్యాసలో సగం, నారింజరసంమీదే వుండటం వల్ల, కూతురుగొంతు వినగానే, అదే వొస్తోందని గుర్తుపట్టాడు.

రమణమ్మ వెండిగ్లాసు తండ్రిముందు టేబిల్‌మీదపెట్టి, చరచరా ఇంట్లోకి వెళ్ళిపోయింది. ప్లీడరుగారు నారింజరసం అతి ఆప్యాయంగా తాగుతూ, చెమటపట్టిన దేహానికి చల్లగాలి అవసరమైగాబోలు, గుమాస్తాకి సౌంజ్ఞ చేశాడు చేత్తో, ఫాన్ వెయ్యమని.

గుమస్తా ఫాన్ స్విచ్ నొక్కాడు. ఫాన్ వేగంగా తిరగసాగింది కొంత ఆరాటం తగ్గటంతో శేషాద్రిరావుగారు వెండిగ్లాసు రసం ఖాళీచేసి, "అబ్బ"అనుకుని, "ఈ ఎండాకాలం నారింజరసం పుచ్చుకోకపోతే వేడితగ్గదు సీతాపతీ" అన్నాడు గుమాస్తాతో.

"అవునండి" అంటూ గుమాస్తా కేసుకట్టల్ని పరిశీలించి, అవసరమైనవి ప్లీడరుగారిముందు పెడుతున్నాడు.

"పంతులూ, బెజవాడనించి ఉత్తరా లేమేనా వచ్చాయా" అని ప్రశ్నించాడు ప్లీడరుగారు.

"ఇంకా టపా రాలేదండి" అని ముక్తసరిగా జవాబిచ్చాడు గుమాస్తా.

ఇదేసమయాన ప్లీడరుగారి సుపుత్రుడు యేనుగన్నలా నెమ్మదిగా నడిచివచ్చి నాన్నకి ఎదురుగా గోడవారగావున్న పేముకుర్చీలో కూర్చున్నాడు.

ప్లీడరుగారు కాయితాలవంక చూసేవాడల్లా తలెత్తి కొడుకువంక ప్రేమగా చూస్తూ, "నాన్నా, రాత్రి ఏదో దగ్గ అన్నావు, కులాసాగావుందా, లేకపోతే, డాక్టర్ సర్వేశ్వరరావుదగ్గిరకెళ్లిరా" అన్నాడు.

"ఇదిగో వెళ్తున్నాను నాన్నగారు. ఎందుకు కనపడమన్నారట!" అని విధేయతగా అడిగాడు కొడుకు.

"మరేం లేదునాయనా, ఇందుకే అమ్మనడిగి, ఫీజు ఐదు రూపాయలు పట్టుకుపో ఎందుకేనా మంచిది. త్వరగారా. ఎండవ తిరక్కు. వెళ్లు" అన్నాడు.

కొడుకు లోపలికి వెళ్లాడు. కొడుకు వెళ్ళేవరకు అటువేపే చూస్తూ కూర్చున్నాడు ప్లీడరుగారు దూడవంక చూసే బర్రెలాగా. కొడుకుమీద ఆయనకంత మమకారం

"ఇంకా పోస్టురాలేదేమోయ్ పంతులూ" అంటున్నాడు ప్లీడరు, చేతినున్న రిస్టువాచీవంక చూస్తూ.

గుమస్తా "రెడ్డిని ఇందాకనే పంపానండి వొస్తూవుండాలి" అన్నాడు.

గోడగడియారం 8½ కొట్టింది. ఆఫీసురూం కిటికీలగుండా వేసవి ఎండ చురుముంటూ లోపలికి పాకుతోంది.

కొంచెం భయంగా, వినయంగా ఓ పన్నెండేళ్ళ కుర్రాడు చేతిలో ఉత్తరాలతో లోపలికి వచ్చాడు. చామనచాయ రంగు; తేనెరంగు కళ్లు తైలసంస్కారంలేని జుట్టు బాగా బిగుతైన చొక్కా పైకి పీక్కుపోయింది. అరలాగు బాగా వొదులుగా, ఇదరికి సరిపడేట్టున్నది. ఈ ఆకారాన్ని చూస్తే కొంచెం నవ్వూ, జాలీ వేస్తుంది ఎవరికేనా.

ప్లీడరుగారు ఉత్తరాలు అందుకుని ఒక్కొక్కటే చింపి చూస్తూన్నారు.

కుర్రాడు ఇంట్లోకి వెళ్లిపోయినాడు.

గుమాస్తా ప్లీడరుగారి మొహంలో మార్పుల్ని బట్టి వుత్తరాల సారం గ్రహించే ప్రయత్నంలో తీవ్రంగా లగ్నమైవున్నాడు.

"వొచ్చిందోయ్, బెజవాడవారి వుత్తరం" అన్నాడు ప్లీడరు గారు, కొంత చేదుగా, కొంత ఎదేవాగా.

"వియ్యంకుడే రాశాడా అండీ" అన్నాడు గుమాస్తా.

"అవును. రంగయ్యగారు స్వయంగా రాశారు; ఎక్కడా వ్యాకరణం పొరపాట్లు లేకండా శుచిగా వుందోయ్ వుత్తరం. అయితే—పైకం సంగతి ఎక్కడా ఎత్తలేదులే. అమ్మాయిని తీసుక వెళ్లండి అని సున్నితంగావుంది ప్రార్థన" అంటూ ప్లీడరుగారు పకపక నవ్వాడు.

గుమాస్తా వూరుకున్నాడు. అది వారి స్వంతవిషయం; చెంగు తొలిగిందని చెప్పినా తప్పే, చెప్పకపోయినా తప్పే—అయితే చిరునవ్వు నవ్వీ నవ్వనట్టు పెట్టాడు మొహం.

"రెండేళ్లనించీ, ఆ వెయ్యిరూపాయలూ ఇవ్వకుండా ఇలాగే కాలం గడుపుతున్నాడు; మళ్లీ పెద్దమనిషి; ఏదో వియ్యంకుడు కదా అని వడ్డీ వెయ్యలేదు. సిగ్గులేకుండా అమ్మాయిని తీసుకెళ్ళాలట" అన్నాడు ప్లీడరుగారు.

గుమాస్తా ఏమీ అనలేదు; నిరామయంగా వింటున్నాడు.

"దీనికంతే నా వ పేపె. అబ్బాయికి ఈ క్షణాన రెండో పెళ్లి చేయగలను; ఎందుకో అని చూస్తున్నాను..." ప్లీడరుగారికి కోర్టులు జ్ఞాపకం వచ్చాయి. "నువ్వు సబ్‌కోర్టుకి వెళ్ళి, O-S 288 నంబర్ దావా, వాయిదా వేయించుకురా. నేను మున్సబ్‌కోర్టుకి వెళ్తాను. సరా" అంటూ లేచాడు.

"ఇలా ఋలు రాయవల్సినవేమైనా ఉత్తరాలున్నాయా పంతులుగారూ" అని కదుక్కున్నాడు సీతాపతిరావు.

"మర్చిపోయినాను. మా వియ్యంకుడికి ఓ కార్డురాయి. కింద నా తరఫున నువ్వే సంతకంచెయ్యి సరిపోతుంది" అన్నాడు ప్లీడరుగారు, శ్వాస నెమ్మదిగా విశాలంగా పీలుస్తూ.

"ఏమని రాయమన్నారు?" సీతాపతి, కాయితం తీసుకున్నాడు.

"ఏముందిలే విశేషం! పైకం సిద్ధంచేసుకుని, కార్యానికి ముహూర్తం పెట్టించవల్సిందని రాయి, సరిపోతుంది. ఇంకేమీ సోది రాయక. ఆఁ?... నే వెళ్తా. స్నానం చెయ్యాలి. భోంచెయ్యాలి. దీం తగలేసిన ఎండ ఈయేడు మరి విపరీతంగావుంది" అంటూ ప్లీడరుగారు లోపలికి వెళ్ళారు.

(ఇంకావుంది)

---

# బారిష్టరుగారి బాతాఖానీ

(4 వ పేజి తరువాయి)

మన రాజకీయవేత్తలకూ మంత్రులకూ పెద్ద చదువులు కావాలనే పట్టింపు లేదు. పెద్ద చదువు అక్కరలేదనే అభిప్రాయమేమో కూడా అని నా అనుమానం. ఒక రాజకీయవేత్త, ఎలాగో ఒక ఛోటా నాయకుడుగా తయారయ్యాడు. జిల్లాబోర్డు ఎన్నికలు వచ్చాయి. తను అధ్యక్షపీఠం అలంకరించాలనీ తరువాత మంత్రిపదవికి మంగళసూత్రం కట్టాలనే మహదాశయంతో కృషి చేస్తున్నాడు. ఆజిల్లాలోనే ఒక గ్రామంలో చాలా సేవ చేసిన పెద్దమనిషి చిత్రపటాన్ని పంచాయతీబోర్డు ఆఫీసులో ఆవిష్కరణం చెయ్యమని వారిని కోరగా అందు కంగీకరించి, చాలాసేపు, జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలను గురించి, విద్యావిధానాన్ని గురించి, గాంధిమహాత్ముని గురించి, దేశాభిమానాన్ని గురించి, ఖద్దరుని గురించి, జిల్లాబోర్డులను గురించి, వోటర్ల కర్తవ్యాన్ని గురించి, సుదీర్ఘోపన్యాసం చేసి అసలు విషయం మరచి కూర్చున్నారు. పక్కనున్న వారు పరాకు తెల్పగా, మళ్లీ లేచి, 'మహాజనులారా! అందుకని నేను ఈ చిత్రపటాన్ని బహిష్కరిస్తున్నాను' అని సెలవిచ్చి కూర్చున్నారు. కరతాళధ్వనులతో సభ ముగిసింది.

ఇలాంటి తమాషాలు చాలా జరుగుతూ ఉంటాయి. వక్తృత్వంకూడా గొప్ప విద్య. దానికితోడు తగ్గ పాండిత్యంకూడా ఉంటే రాణిస్తుంది. ఏ ఒక్కటున్నా చాలదు. కీర్తిశేషులైన చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారు ఏలాటి హేమాహేమీలున్న సభలోనైనా అనర్గళంగా కొన్ని గంటలు మాట్లాడేవారు. చివరకు ఏమిటి విషయమంటే ఇదమిద్ధమని తెలవకపోయినా గంట ఒక్క క్షణంగా కనపడేది. ఒక్క నిమిషంకూడా వినకుండా వళ్లి బుద్ధిపుట్టేది కాదు. అది ఉపన్యాస మనిపించేదికాదు. అదొక *Entertainment* గా ఉండేది. అలాగే పానుగంటి నరసింహారావుగారూను. వారి ఉపన్యాసంవల్ల కొందరికి దెబ్బలూ గాయాలూ తగిలినా విన్నంతసేపు చాలా బాగుండేది.

ఇప్పుడింట్లో మూలనున్న ముసలమ్మ దగ్గరనుంచి, రైలులో మందులమ్మే వాడిదాకా అందరకూ ఉపన్యాస ధోరణి బాగా పట్టుపడ్డది. అందరికీ ఒకటే ఉద్దేశం - శ్రోతలు, వట్టి దద్దమ్మలని. రైలులో మందులమ్మేవాళ్లని కనిపెట్టండి. లోపలికివచ్చి, నాలుగువైపులా చూచి, ఒక్క నిమిషం మన సంభాషణలు కట్టిపెట్టడానికి సావకాశమిచ్చినట్టు ఊరుకుని, 'ఆఁ చూడండి' అని అరంభిస్తాడు. అంటే ఏమిటి - మీ చచ్చు బాతాఖానీ ఎప్పుడూ ఉండేదే.' ఒక్క క్షణమైనా అది కట్టిపెట్టి నేను చెప్పబోయే విషయం వింటే బాగుపడతారని. ఆ 'ఆఁ చూడండి' లో అంత భావ ముందన్నమాట.

కొందరు కేవలం అర్థంలేని శబ్దాడంబరం కోసం మాట్లాడతారు. మన కెలాగూ తెలియదని-'అధ్యక్ష హార్యక్షుల సమక్షమందు, నిరక్షరకుక్షినైన నేను, నాకుక్షింభరత్వమునకు ప్రత్యక్షసాక్షిభూతముగ.....' ఇదీ ధోరణి

ఉన్న కర్మ చాలక ఉపాకర్మ అన్నట్లు, ఈ రాజకీయవేత్తలూ ప్రచారకులూ చాలనట్లు ఈమధ్యను మరీ ఎక్కువగా ఏడెనిమిది సంవత్సరాలనుంచి ప్రతి కాలేజీలోనూ సాంస్కృతికోత్సవాలనే తిరునాళ్ళు ప్రారంభమయ్యాయి. నవంబరు ఆఖరు వారంనుంచి జనేవరు ఆఖరువరకూ ఈ తిరునాళ్ళు జరుగుతుంటాయి. ఎక్కడున్న కవులూ కథకులూ ఈనాడు బయటపడి వక్తలుగా తయారయ్యారు. ఈ రెండు నెలలూ ఏ రైలులో చూచినా, తిరునాళ్ళకు వెళ్ళేవారో వెళ్ళివస్తున్నవారో కొందరు రచయితలు - బాధ్యతలు ఎరిగిన వారూ ఎరగని వారూ తెలుగులో ఉంటారు. పాపం విద్యార్థులకు ఎవ్వరిని పిలవవచ్చు, ఎవరిని పిలవకూడదనే పక్షపాతబుద్ధి ఉండదు. హాస్యనటులు రమణారెడ్డి, రేలంగి మొదలు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ వరకూ అందరినీ పిలుస్తారు. అందరూ వెడతారు. సంస్కృతంలాంటి తెలుగుతోటి, ఇంగ్లీషులాంటి తెలుగుతోటి, తెలుగులాంటి ఇంగ్లీషుతోటి అనేక రకాలుగా యథాశక్తి విజ్ఞానం వెదచల్లి వస్తూఉంటారు, ఈ కవిప్రకాండులు. వాటి బాగోగులన్నారా- ఓ పూటకూటి అమ్మని ఏమండీ ఇక్కడ భోజనం బాగుంటుందా అంటే తినేవాళ్ల దంతసిరినిపట్టి ఉంటుంది నాయినా అందిట- అలాగే ఉపన్యాసం బాగోగులు శ్రోతల చెవులలో ఉంటుంది.

మీ ఖర్మంకాలి ఈ కవిగారి ఉపన్యాసం మీకు భాగాలేదు. అందుకనే నేను ముందే చెప్పానా వెళ్లకండిరా బాబూ అని. ఒకరి అనుభవా లింకొకరి కక్కరకురావు. ★




# ప్రజ లేమంటున్నారు?

# స్పెక్ పిల్స్

(Regd 266)

(కొన్ని వివిధ శాఖా ప్రముఖుల అభిప్రాయములు)




Our Product SPECK PILLS has been duly registered by Govt. under No 266

"కోరిన గుణము చేకూరినది"

Mudigere

ప్రకటనద్వారా "స్పెక్ పిల్సు" నా మిత్రుని కొరకై తెప్పించి వాడినాను అవి కోరిన గుణము చేకూర్చినవని మిక్కిలి సంతోషముతో తెలియజేయుచున్నాను నేను నా మిత్రులందరికి "స్పెక్" మాత్రలను వాడ సిఫార్సు చేసినాను. ముమ్ముందు నేను యింకా ఎక్కువగా "స్పెక్" మాత్రలను వాడగలను మీ "స్పెక్" మాత్రలు నిరపహానికరమైనవనియు, కోరినగుణ మిచ్చునవియు నిస్సందేహముగా చెప్పగలను.

Dr Sukumaran, Medical officer

• • •

"సంతాన నిరోధకమునకు సాటిలేని ఔషధము"

Calcutta

మీ స్పెక్ మాత్రలు చాల ఆశ్చర్యకరమైన గుణమిచ్చినవి అందుచే ఇవి సంతాన నిరోధకమునకు సాటిలేని మందు అనియు అందరు నిస్సంశయముగా వాడదగ్గ మందు అని దృఢముగా చెప్పగలను

B L Das, Head-clerk, Bonner &co

• • •

"వాడినంతనే అద్భుతముగా ఫలితము నిచ్చేదిది"

Kazipet

"స్పెక్" మాత్రలను వాడినంతనే అత్యద్భుతముగా కోరిన ఫలితము చేకూర్చినవి స్వానుభవముచే కనుగొన్న యీ గుణమును దేశములో ప్రజలందరికి వెల్లడిచేయుట నా విధియైయున్నది "స్పెక్" మాత్రలు నిరపహానికరమైనవి, శాశ్వత గర్భ నిరోధకము కలుగ జేయును

D. N Rao Naidu, RTD

• • •

"ఫలితము సంపూర్ణ తృప్తి నిచ్చినది"

Yellabanda Ceylon

మీరు పంపిన "స్పెక్" మాత్రలు గర్భనిరోధకమునకు జయప్రదముగా పనిచేసినవి. ముమ్ముందు మీ యితర ఔషధము మరి యెక్కువ వాడ నిశ్చయించినాను. ఇటువంటి ఆశ్చర్యకరమైన గుణము నిచ్చేది యీ ఔషధమును వాడ నా మిత్రులందరికి సిఫార్సు చేసినాను.

S. R. Shanmugham

"సంతాన నిరోధకమునకు నిజముగా వరప్రసాదము"

Poh Estate Ringlet, Malaya

నా స్వానుభవముచే తెలిసికొన్న "స్పెక్" మాత్రలయొక్క అద్భుతకరమైన ఫలితమును తెలియగోరుచున్నాను. ఇది నిజముగా సంతాన నిరోధకమునకు వరప్రసాదమువంటిది.

L S Menon,

• • •

"నిరపహానికరమైనది - సాటిలేని ఔషధ రాజము"

Ananthapur

"స్పెక్" కోరిన గుణమును ఏలాటి హానికరమైన పరిస్థితులు కలుగజేయకుండా, లభ్యపరచిన

## గర్భనిరోధం

"స్పెక్" పిల్సు (Regd 266) 12 రోజులు సేవించిన 6 సం॥లు శాశ్వత గర్భ నిరోధకం కలుగ జేయును నెల నెల మామూలుగా బహిష్టు అవుతూ వుంటారు. గ్యారంటీగల మందు. వేనకువేల ప్రశంస పత్రములు గొన్నది. నకిలి మందులు కొని మోస పోకండి. ధర బుడ్డి 1-కి రు 12-0-0. వి. పి. పి. ప్రత్యేకం.

**SEENU & Co.,**

**P. B. No. 1638 ( J ) Madras-1.**

బ్రాంచీలు · సింగపూరు, బెజంబ్సు · సిలోన్.

దని యిందుమూలముగా మీకు తెలియజేయుచున్నాను ఇది నిజముగా స్త్రీలపాలిటి వరప్రసాదిని. గర్భనిరోధకమునకు సాటిలేని ఔషధము

G. Madhavarajulu, Telugu Pandit

• • •

"నిస్సంశయముగా కోరిన గుణమిచ్చేది ఔషధము"

Bangalore

నేను కంపెనివారిచే తయారైన "స్పెక్" మాత్రలు గర్భనిరోధకమునకు వాడ్యతగలమందు నేను ఈమందు వాడి కోరినగుణము నొందితిని ఈమందు నాకు పరిపూర్ణసంతృప్తి చేకూర్చినది గర్భనిరోధకమునకు అందరు "స్పెక్" మాత్రలను వుపయోగింప సిఫార్సు చేయుచున్నాను

G E Srikanthiah B A

"నమ్మదగిన మందు"

Mopidevi Kistna Dt.

మూడుపర్యాయములు మీ "స్పెక్" మాత్రలను వాడినాను ఇది నమ్మదగినదియు గర్భనిరోధకమునకు శ్రేష్ఠమైన మందని హృదయపూర్వకముగా తెలియజేయుచున్నాను.

R Venkatapathi Rao

• • •

Marupaka, Vizag Dt.

"ప్రశంసనీయమైన గుణము గలది"

"స్పెక్" మాత్రలు గర్భనిరోధకమునకు చాల వుపయోగకారి యిది వుపయోగించిన స్త్రీలస్వానుభవ అభిప్రాయములో స్పెక్ మాత్రలు ప్రశంసనీయమైన గుణము గలవి

N V Brambaji

• • •

"సంతాన నిరోధకమునకు దైవానుగ్రహము"

Midutur, Kurnool Dt

"స్పెక్" మాత్రలను మీ నిబంధనను ననుసరించి వాడినాను అవి కోరిన గుణము నిచ్చినవి దేహమునకు ఏలాటి చెరుగు కలిగించలేదు ఇది నిజముగా సంతాననిరోధకమునకు దైవానుగ్రహము

T R. Reddy

• • •

గర్భనిరోధకమునకు శ్రేష్ఠమైనది

Tenali

"స్పెక్" మాత్రలు మీ కంపెనీనుండి తెప్పించి వాడితిని వాటి ఫలితముచే సంపూర్ణతృప్తి నందితిని ఈమందు గర్భ నిరోధకమునకు బహు శ్రేష్ఠమైనదని నేను నిస్సందేహముగా చెప్పగలను.

N S Lakshmanarao

• • •

"పూర్తి ఫలితము చేకూరినది"

Modukur Guntur Dt

మీరు వి. పి. పి మూలమున పంపిన "స్పెక్" మాత్రలను వుపయోగించి కోరినఫలిత మొందితివి.

S. S Rao.

• • •

గర్భనిరోధకమునకు అద్వితీయమైనది

Kollkunta

ఒకపర్యాయము "స్పెక్" మాత్రలను వాడి వాటి ఫలితముద్వారా గర్భనిరోధకమునకు అద్వితీయమైన మందని తెలిసికొంటిని ఈ నా స్వానుభవమైన అభిప్రాయము మీకు నా హృదయపూర్వకమైన వందనములతో తెలియజేయుచున్నాను

K Moosa Saheb

# విజయావారి "మిస్సమ్మ" సమీక్ష

విజయవారి "మిస్సమ్మ" చక్కని కామెడీ చిత్రం హాస్యం, వినోదం ప్రధానంగా పెట్టుకుని ఈ చిత్రం నిర్మించబడింది. ఎన్. టి. రామారావు, సావిత్రి, జమున, నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, రమణారెడ్డి, ఋష్యేంద్రమణి, దొరస్వామి మున్నగువారు నటించారు. ప్రసాద్ గారు డైరెక్టు చేశారు. చక్రపాణిగారు సంభాషణలు రచించారు. పింగళి నాగేంద్రరావు గారు పాటలు వ్రాశారు. వీటికి రాజేశ్వరరావుగారు సంగీతం సమకూర్చారు. అనుభవశాలురైన విజయవారి టెక్నీషియన్లు చిత్రానికి వన్నెలు తీర్చిదిద్దారు. వీటన్నిటితో "మిస్సమ్మ" మంచి చిత్రంగా తయారైంది.

ఒక జమీందారు పదహారేళ్ళ క్రితం తప్పిపోయిన తన పెద్దకుమార్తె పేర ఒక ఎలిమెంటరీ స్కూలు పెట్టించి దాన్ని నడపడానికి బి. ఏ. చదివిన దంపతులు కావాలని ప్రకటించడం, మిస్ మేరీ, రావు అనే యిద్దరు యువతీ యువకులు తాము భార్యాభర్తలమని అబద్ధమాడి ఆ ఉద్యోగాలు సంపాదించడం, చివరకు వారిద్దరూ భార్యాభర్తలు కారనీ, మిస్ మేరీ ఇదివరలో తప్పిపోయిన జమీందారుగారి కుమార్తె అనీ బయటపడడం జరుగుతుంది. ఈలోగా ఒకరి నొకరు ప్రేమించుకున్న రావు, మిస్ మేరీ చిత్రం అంతంలో వివాహమాడి నిజంగా దంపతులవుతారు.

ఈ కథలో మిస్ మేరీ జన్మతః హిందువుల పిల్ల అయినా, తలిదండ్రులనుండి తప్పిపోయి క్రైస్తవుల యింట్లో పెరుగుతుంది. క్రైస్తవ మత వాతావరణంలో పెరిగిన ఆమె ఉదరనిమిత్తం హిందూ సతిగా నటించవలసిన అగత్యం ఏర్పడుతుంది. హిందువుల ఆచారాలు, అలవాట్లు ఆమెకు రుచించవు. వాటిని అసహ్యించుకొంటుంది. క్రైస్తవమతమే అన్నిటికంటె గొప్పదని భావిస్తుంది. కాని చివరికి తాను నిజంగా హిందువుల పిల్లయేనని తెలుసుకుని మతాలకంటె మానవత్వమే గొప్పదని గ్రహిస్తుంది. అంతేకాక రావు మంచితనం చూసి అతన్ని ప్రేమిస్తుంది. ప్రేమకు మతభేదాలు అడ్డం రావని, మతవిశ్వాసా లెటువంటివైనా సంఘజీవనానికి అడ్డురాగూడదనీ ఈ పాత్ర ద్వారా కథా రచయిత నిరూపించారు.

నేటి కాలపు నిరుద్యోగ సమస్య కథలో ప్రధానాంశమైనా, దానిని మామూలు ధోరణిలో కాకుండా హాస్యధోరణిలో ఉపయోగించుకొన్నారు రచయిత. మొదటినుంచి చివరదాకా హాస్యమే ప్రధానమై ప్రేక్షకులను వినోదింపజేస్తుంది. ఈ హాస్యం సన్నివేశాలలోనూ, సంభాషణలలోనూ



రాగిణీవారి "అర్ధాంగి" లో సురభి బాలసరస్వతి, జగ్గయ్య మున్నగువారు.



బొంబాయిలో "హామ్లెట్" హిందీ చిత్రం విడుదలఅయిన సందర్భంలో నిర్మాత - దర్శకుడు - నటుడు కిశోర్ సాహూ, ఒఫీలియాగా నటించిన మాలాసిన్హా, ఫొటోగ్రాఫరు కపాడియా.

## ★ "మిస్సమ్మ" సమీక్ష ★

కూడా సాధించబడింది ఒక పాత్రల సంగతి చెప్పనే అక్కర్లేదు విజయావారి చిత్రాలన్నిటిలోనూ పాత్ర సృష్టి విచిత్రంగా వుంటుంది సజీవములైన పాత్రలున్న చిత్రం రాణించినట్లుగా మరొక చిత్రం రాణించదు ఉత్సాహాలు తగిలితే పాత్రీకరణం సిద్ధిస్తుందనే సూత్రంతో తయారైన చిత్రాలు తెలుగులో బాగా వున్నాయి కేవలం ఊతపదాల మీదనే ఆధారపడకుండా వ్యక్తిత్వం కలిగిన పాత్రలను సృజించడం విజయావారి పద్ధతి "మిస్సమ్మ"లో మిస్ మేరీని పెళ్ళి చేసుకోవాలని తాపత్రయపడే డేవిడ్ అచ్చగా క్రిస్టియన్ యువకునిలా కనిపిస్తాడు, ప్రతివాడి దగ్గిరా డబ్బుపిండే సోమరిపోతు బిచ్చగాడు దేవయ్య, ఆంధ్రా షెర్లాక్ హోమ్స్ రాజు కూడా ఇలాంటి వ్యక్తిత్వంకల పాత్రలే అతి గారాబంవల్ల వయస్సుతోబాటు మనస్సు వికసించని పిల్లలకు ఉదాహరణ జమీందారు రెండో కూతురు సీత

ఎమ్ టి. రావుమీద అంతవరకూ అజ్ఞాతమైన ప్రేమతో వున్న మిస్ మేరీ అతడు సీతను ప్రేమిస్తున్నాడని భ్రమపడి, జెలసీతో బాధపడి చివరకి ప్రేమను బహిర్గతం చేసుకొంటుంది ఇక్కడ కథారచయిత నేర్పు బాగా కనిపిస్తుంది అదే విధంగా డిటెక్టివ్ రాజు కూడా తన మేనమామ కూతురు సీత మిస్టర్ రావును ప్రేమిస్తోందని జెలసీతో బాధపడి ఆమెను తనదిగా చేసుకోడానికి ప్రయత్నిస్తాడు

రాజేశ్వరరావుగారి సంగీతం ఆహ్లాదకరంగా వున్నది "బృందావనమది అందరిదీ" అనే పాటలో రాజేశ్వరరావుగారు అనుక్రతంగా వస్తున్న ఏదో ట్యూనును చాలా చక్కగా ఉపయోగించుకొన్నట్లు అనిపించింది ఆ పాట బాగున్నది జమునా నృత్యాలు చక్కగా ఉన్నాయి మిస్సమ్మగా సావిత్రి, రావుగా ఎన్ టి. రామారావు బాగా నటించారు

ఈ చిత్రానికి బెంగాలీలో రవీంద్రనాథ మైత్రా వ్రాసిన ఒక నాటకం ఇతివృత్తం చాలవరకూ ఆధారమైనది "ఉదరనిమిత్తం" అనే పేరుతో యీ నాటకాన్ని శ్రీ చక్రపాణిగారు రిదివరలో తర్జుమా చేశారు అయితే ఆ కథకు చాలా మెరుగులు పెట్టి, అందులో లేనివి కొన్ని చేర్చి యీ కొత్త చిత్రం తయారుచేశారు మిస్ మేరీ చిన్నప్పుడు తప్పిపోయిన పిల్లకావడం ముఖ్యమైన మార్పు ఈ మార్పువల్ల కథకు మంచిబలం చేకూరింది మిస్ మేరీమీద జమీందారు దంపతులు చూపించే 'అతి' అనురాగానికి ఆమె వారి కుమార్తెయైనా నే కారణం బాగా ఉపకరించింది పైగా ఆమె జన్మతః హిందువుల పిల్ల కావడానికి ఆమె క్రైస్తవయువతి నని అనుకొని ఏర్పరచుకున్న మతవిశ్వాసాలకూ గల వైరుధ్యం ఆ పాత్ర ప్రయోజనాన్ని మరింత దృఢంచేసింది ★



విక్టర్ హ్యూగో నవల "లే మెజ రిబ్ల్' పై ఆధారపడిన కథం మినర్వా మువిటోన్ నిర్మిస్తున్న
"కుందన్" చిత్రంలో సొహ్రాబ్ మోడి (జాఁవాల్ జాఁ పాత్ర వేషంలో)

బొంబాయి సినీమాలేఖ :

# టాకీచిత్రాల రజతోత్సవ సంవత్సరం

## (ఆంధ్రభారత పత్రిక విలేఖరి)

భారతీయ చలనచిత్రాల చరిత్రలో వచ్చే మార్చి 14 వ తేదీ చాలా ముఖ్యమైనది

ఆరోజున భారతీయ సినిమా పరిశ్రమ టాకీచిత్రాల రజతోత్సవ సంవత్సరంలో అడుగుపెడుతుంది మొదటి భారతీయ టాకీ చిత్రం "అలంఅరా" 1931 మార్చి 14 వ తేదీన బొంబాయిలో విడుదల అయినది

ఆచిత్రం నిర్మాత అర్దేశిర్ ఇరానీ. ఇప్పుడాయన వయస్సు 70 ఏళ్లు సినిమారంగం నుండి ప్రస్తుతం విరమించుకున్నారు . ఆయన తీసిన "అలంఅరా" ఆరోజుల్లో బ్రహ్మాండమైన బాక్సాఫీస్ విజయం సాధించింది

"అలంఅరా" చిత్రంతో భారతీయ చిత్రాల్లో మొదటిసారిగా సంగీతం అడుగుపెట్టింది అప్పటినుండీ భారతీయ సినిమా పరిశ్రమ బహుముఖాలుగా విజృంభించినది ఈరోజున అమెరికన్ పరిశ్రమ తర్వాత స్థానం మన పరిశ్రమదే. 60 పైగా స్టూడియోలతో, దాదాపు 42 కోట్ల రూపాయల పెట్టుబడి ధనంతో మన సినిమాపరిశ్రమ అభివృద్ధి అవుతోంది ఏటా 24 కోట్లరూ లరాబడి వస్తోంది. అందులో సగంపైగా పన్నులరూపేణా జాతీయ కోశాగారానికి ముడుతోంది ఈ పరిశ్రమ దాదాపు 5 లక్షల మందికి జీవనోపాధినిస్తోంది. ప్రతిరోజూ అన్ని తరగతులకూ చెందిన 80 లక్షల మంది ప్రజలకు వినోదం ఇస్తోంది టెక్నికల్ అభివృద్ధి విషయంలో మన పరిశ్రమ మరేదేశ పరిశ్రమకూ వెనకబడలేదు ఇటీవల మనజాతీయప్రభుత్వం ఈ పరిశ్రమ ప్రాధాన్యాన్ని, దానికి జాతీయ జీవితంలో ఉన్న ప్రముఖ స్థానాన్ని గుర్తించింది గత సంవత్సరం ప్రారంభింపబడిన బహుముఖల పద్ధతి సినిమా పరిశ్రమకు ప్రోత్సాహకారణమైన మంచి చర్యగా భావింపబడుతున్నది. పరిశ్రమ అభివృద్ధికి అవసరమైన మరికొన్ని ముఖ్యమైన చర్యలను ప్రభుత్వం త్వరలో తీసుకోబోతున్నది నేషనల్ ఫిలింబోర్డును స్థాపించే విషయమై కేంద్రసమాచార శాఖామంత్రి డా॥ బి వి. కేస్కార్ రాష్ట్రప్రభుత్వాలనూ, సినిమా పరిశ్రమ ప్రతినిధులనూ సంప్రదించినట్లు తెలుస్తున్నది ఈ నేషనల్ ఫిలింబోర్డు సెన్సారింగ్ బాధ్యత నిర్వహించడమేకాక, చిత్రనిర్మాణంలోని అన్ని శాఖలలోనూ నిర్మాతలకు సలహా లిస్తుంది పరిశ్రమలోని వ్యక్తులకు తగిన తర్ఫీగు అవకాశాలు ఏర్పాటు చేస్తుంది ఈ చర్యలకు అవసరమైన బిల్లునొకదాన్ని వచ్చేపార్లమెంటు సమావేశంలో ప్రవేశపెట్టగలరని కూడా తెలుస్తున్నది

పరిశ్రమ మీద ఏదో విధంగా ప్రభుత్వాధికారాన్ని స్థాపించడానికే నేషనల్ ఫిలింబోర్డు ఉపయోగపడుతుంది పరిశ్రమలోని ప్రముఖులు చాలమంది తమపై ప్రభుత్వపు కంట్రోల్ ఉండరాదనీ, అలాఉంటే వ్యాపారమూ, ఫిలిముల స్థాయీకూడా దెబ్బతింటాయనీ భావిస్తున్నారు కంట్రోలు ఉండాలనేవారు, సినిమాపరిశ్రమలో ఇప్పుడున్న అరాచక స్థితినిబట్టి ప్రభుత్వం కంట్రోల్ చేయడం అత్యవసరమని భావిస్తున్నారు కంట్రోల్ లేకపోతే ఫిలింపరిశ్రమ ఎన్నటికీ వ్యాపారపద్ధతులపై సంఘటితం కాలేదని వీరివాదన

కాని ఈవాదన మరీ నిరాశావాదంగా కనిపిస్తుంది ఎందుకంటే పరిశ్రమక్రమ పద్ధతిపై నడవడానికి అనువైనచర్యలు తీసుకోబడడం ప్రారంభమైంది కిందటి ఏడు పరిశ్రమలోని వివిధశాఖలకు సంబంధించిన వ్యక్తులు — తారలనుండి స్టూడియో కార్మికులవరకూ అందరూ తమతమ ప్రత్యేక సంఘాలను స్థాపించుకున్నారు. కొన్ని పెద్దపెద్ద స్టూడియోలు ఇప్పుడు కార్మికుల సహకారసంఘాలచేతనే నిర్వహింపబడుతున్నవి బొంబాయిలోని ఎమ్ & టి, మోహన్, ప్రకాష్, రంజిత్ స్టూడియోలు, పూనాలోని డక్కన్, నవయుగ స్టూడియోలు కలకత్తాలోని ఒకటిరెండు స్టూడియోలు కార్మికసహకారసంఘాల యాజమాన్యంక్రిందనే పనిచేస్తున్నాయి. ఈసహకారసంఘాలు చిత్రాలుకూడా నిర్మిస్తున్నాయి , కార్మికులచే నిర్మితమైన చిత్రాల్లో "బాద్‌బాన్" "సౌభాగ్య" చిత్రాలు చాలావిజయవంతంకూడా అయినాయి

*   *   *

కొత్తగాపైకివచ్చిన తారచాంద్ ఉస్మానీ ఇటీవల "అమానత్" చిత్రంలో బుక్ అయినది ఈమె కర్దార్ — కోలినాస్ — టెక్నికో అందాలపోటీలో రెండవ బహుమతి



ఇంగ్లీషు, హిందీ భాషల్లో ఫిలింతీయడానికి ఫిల్మిస్థాన్ వారితో సంప్రదించవచ్చిన డైరెక్టర్ విక్టర్ కటోనా, ఆయనకు బొంబాయి విమానాశ్రయంవద్ద స్వాగతమిచ్చిన హితేన్ చౌధురి విక్టర్ కటోనా ఒకప్పుడు అలెగ్జాండర్ కోర్డాతో పనిచేశారు

పొందీ, ఆతరువాత "జీవన్‌జ్యోతి" చిత్రంలో మొదటిసార్యాయం నటించి పేరు తెచ్చుకున్నది ఆమె రెండో చిత్రం "బరాటీ" మొదటినుండీ ఆమె నిర్మాత ఎ ఆర్. కర్దార్ చిత్రాల కంట్రాక్టులో ఉన్నది. ఇప్పుడామె ఇతరుల చిత్రాల్లోకూడా నటించడానికి అనుమతి లభించింది బిమల్ రాయ్ నిర్మిస్తున్న "అమానత్" చిత్రంలో ఆమె ఇప్పుడు నటిస్తోంది ఈ చిత్రం గత మాసంలో మోహన్ స్టూడియోస్‌లో ప్రారంభమైంది ఈ చిత్రం సంగీతదర్శకుడు సలిల్ చౌధురి ప్రముఖదర్శకుడు అరవిందసేన్ డైరెక్టుచేస్తాడు. ప్రేమేంద్రమిత్ర రచించిన "సమాధాన్" నవల ఈ చిత్రానికి ఆధారం. నజీర్‌హుసేన్ కన్హయాలాల్, కృష్ణకాంత్, చాంద్‌బర్కె, సరితాదేవి, అసిత్‌కుమార్ మున్నగువారుకూడా నటిస్తున్నారు

* * *

మిస్ మాలినీ?, మనోహర్ చిత్రాలు నిర్మించిన మద్రాస్, జూపిటర్ పిక్చర్సువారు ప్రస్తుతం "నయాఆద్మీ" అనేహిందీ చిత్రం తీస్తున్నారు దర్శకుడు సి పి దీక్షిత్. అంజలీదేవి, ఎన్ టి రామారావు, జమున, నాగేంద్రరావు, రామశర్మ, గోప్, అన్వర్ హుసేన్ మున్నగువారు ఈ చిత్రంలో నటిస్తున్నారు

* * *

1940 లో కేదార్ శర్మ డైరెక్టు చేసిన గొప్ప చిత్రం "చిత్రలేఖ" కథ తిరిగి హిందీలో నిర్మింపబడుతున్నది చిత్రలేఖ నవల వ్రాసిన రచయిత భగవతీచరణవర్మ ఈ చిత్రాన్ని ఆలిండియా పిక్చర్సువారు గేవాకలర్‌లో ఎస్ కె ఓఝా దర్శకత్వాన నిర్మిస్తున్నారు మౌర్యరాజులకాలం నాటి ఈ కథలో నర్తకిగా వైజయంతీమాల, ఆమె ప్రియుడుగా ప్రదీప్‌కుమార్ నటిస్తున్నారు ఇదే కంపెనీవారు మరొక చిత్రం "సితారా" అనే పేరులో నిర్మిస్తున్నారు. ఇందులోకూడా వైజయంతీమాల, ప్రదీప్‌కుమార్‌లు నటిస్తున్నారు ఆలిండియా పిక్చర్సువారు తమ కొత్త చిత్రం "హూర్-ఇ-అరబ్" చిత్రాన్ని విడుదలకు సిద్ధంచేస్తున్నారు 'గ్లామర్' తార చిత్రా ఇందులో నటించింది శశికళ, ప్రదీప్‌కుమార్, గోప్, ఓంప్రకాష్, సజ్జన్ తదితర నటీనటులు

* * *

ఫిల్మిస్తాన్‌వారు ఇటీవల తమ "నాస్తిక్" చిత్రానికి రజతోత్సవంచేశారు ఈ ఏడాది రజతోత్సవగౌరవం పొందిన మొదటి చిత్రం ఇదే ఆ చిత్రం విజయానికి అందులోని పాటలు ముఖ్య కారణం పాటలు వ్రాసిన కవి ప్రదీప్ ఫిల్మిస్తాన్ వారి రాబోయే చిత్రం "జాగృతి'లో పాటలుకూడా ఆయనే వ్రాశాడు మొన్నటి



ఇటీవల మద్రాసు వచ్చిన చైనీస్ సాంస్కృతిక ప్రతినిధులతో వైజయంతీమాల. చైనీస్ నర్తకులు వైజయంతీమాలవద్ద భరతనాట్యపాఠాలు నేర్చుకున్నారు.

ఉత్సవ సభలో ప్రదీప్ "జాగృతి" లోని రెండు జాతీయ గీతాలు పాడి సభికులను ముగ్ధులను చేశాడు.

కొన్నేళ్ళక్రితం "కిస్మత్" లో ఘర్ ఘర్‌మె దివాలీ అనే పాట దేశమంతటా మారుమోగి పోయేది ఆ పాట రాసిన కవి ప్రదీప్ అప్పటినుండీ ఆ పాట తాలూకు గ్రామొఫోను రికార్డు విశేషంగా అమ్ముడుపోయింది "నాస్తిక్" చిత్రంలోని పాటలు ఇప్పుడు కిస్మత్ పాటలనుకూడా తలదన్ని ప్రథమస్థానం ఆక్రమించాయి ముఖ్యంగా "కిత్‌నా బదల్ గయా ఇన్సాన్' అనే పాట

ఫిల్మిస్తాన్ వారి "జాగృతి' కి మూలం ప్రసిద్ధ బెంగాలీ చిత్రమైన "పరివర్తన్" ఈ బెంగాలీ చిత్రంలో అందరూ పిల్లలే నటించారు

* * *

జనవరి 7 న ఇరవయ్యో జన్మదినం జరుపుకున్న రూపమాల వరసగా మూడు చిత్రాల్లో బుక్ అయింది వీటిలో ఒకటి ఫిల్మిస్తాన్ వారు తీయనున్న సంగీత చిత్రం

* * *

కీ॥ శే॥ వినాయక్ కుమార్తెయైన బేబీ నందా "ఇంసాఫ్" అనే మరాఠీ చిత్రంలో నటిస్తున్నది ఈమె జనవరి 8 న 14 వ జన్మదినోత్సవం జరుపుకున్నది. ఆరోజున ఆమె శ్రీ సౌండ్ స్టూడియోస్‌లో అద్భుతమైన నాట్య ప్రదర్శనం చేసింది.

* * *

15 ఏళ్లనుంచీ నామకార్థంగా వున్న భారత ఫిలిం ఆర్టిస్టుల సంఘం ఈ నెల 9 వ తేదీన రద్దుచేయబడింది ఫిలిమ్ ఆర్టిస్ట్స్ గిల్డ్ అనే పేరుతో కొత్త సంఘం ఒకటి ప్రారంభింపబడుతున్నది

## మీనాకుమారి

### (ఈ వారం ముఖచిత్ర తార)

నాలుగోయేటనే నటిగా జీవితం ప్రారంభించి, ఈనాడు తారాపథంలో ఉన్నత స్థానం ఆక్రమించిన హిందీతార మీనాకుమారి ఈమె అసలుపేరు మహజాబీన్. చిన్నప్పటినుంచి స్టూడియోలలో రాత్రింబగళ్లు శ్రమపడి పనిచేసేది వయస్సు వచ్చేసరికి, ఫిలిములలో తనవాదరిగానే పనిచేసే యువతులందరూ ఎదుర్కొనవలసిన కష్టాలు, సమస్యలు ఆమె అనుభవం చేసుకున్నది అయినా ధైర్యంతో, నటనా చైతన్యంతో ఆమె క్రమంగా అన్ని అవరోధాలనూ

## మీనా కుమారి

క్కాని 1953 నాటికి మంచిపేరు తెచ్చుకో గలిగింది. అప్పటి పెద్దతారలందరికీ పోటీగా తయారైంది. అప్పట్లో తండ్రినీ, ఇద్దరు చెల్లెళ్లనీ ఆమెయే పోషింపవలసి వచ్చేది. తను సంపాదించిన ధనంపై కూడా తనకు స్వాతంత్ర్యం ఉండేదికాదు.

మొదటినుంచీ ఆమెకు సారస్వతమంటే అభిమానం. ఉర్దూలో మంచిమంచి కథలు వ్రాసేది. తనవలెనే సారస్వతాభిమానీ, మంచి రచయిత అయిన కమాల్ అమ్రోహీని ఆమె రహస్యంగా పెళ్లిచేసుకున్నది. ఈ వార్త ఫిలింరంగంలోవారందరినీ చకితులను చేసింది. కమాల్ అమ్రోహీ అప్పటికే వివాహితుడు.

“పరిణీత”లో మీనాకుమారి అభినయం ఎంతో ప్రశంసలు చూరగొన్నది. ఇప్పుడు హిందీచిత్రాల్లో ఆమెతో సమానంగా ధనం పుచ్చుకునే తారలు మరెవరూ లేరు.

ఇప్పుడీమె పక్షిరాజావారి “ఆజాద్” హిందీచిత్రంలో దిలీప్‌కుమార్‌తో కలిసి నటిస్తున్నది. వీరిద్దరూ మొదటిసారిగా కలిసి నటించిన చిత్రం “ఫుట్‌పాత్” అది 1952 సం॥పు చిత్రం. తరువాత మెహబూబ్ వీరిద్దరినీ తన “అమర్” చిత్రంలోకి బుక్ చేశాడు. ఆ చిత్రం తయారవుతుండగా ఇద్దరికీ స్పర్థలు వచ్చాయి. సెట్సుమీద తనకు అవమానం జరిగిందని, అందుచేత దిలీప్‌తో కలిసి నటించననీ మీనాకుమారి తెలిపింది. భారతీయ చిత్రనిర్మాతలసంఘం (ఐ ఎమ్ పి పి ఎ) వారు కూడా వీరిద్దరికీ రాజీ కుదర్చలేకపోయారు. అది 1953 జూలైలో జరిగింది. ఇద్దరు ఎక్కడున్నా ఎదురుపడినా మాట్లాడుకునేవారు కారు. తరవాత జరిగినది తెలియదుగాని దిలీప్‌తో కలిసి “ఆజాద్”లో నటించడానికి మీనాకుమారి అంగీకరించింది. బొంబాయిలో సాధ్యం కాని రాజీ కోయంబత్తూరులో సాధ్యమైనది.

“ఆజాద్” చిత్రంలో మీనాకుమారి, దిలీప్‌కుమార్‌లకు సంబంధించిన భాగం షూటింగ్ పూర్తయింది. చిత్రం కూడా పూర్తికావస్తున్నటు తెలుస్తోంది ★

## వి. కె. కృష్ణమీనన్‌కు నిర్మాతల సన్మానం

ఐక్యరాజ్య సమితిలో భారతప్రతినిధి, లండన్‌లోని ఇండియా ఫిలిం సొసైటీ అధ్యక్షుడు అయిన వి కె కృష్ణమీనన్ గారికి దక్షిణ భారత ఫిలిం వాణిజ్య మండలివారు, స్టూడియో యజమానుల సంఘంవారు ఈ నెల 13 వ తేదీన జెమినీ స్టూడియోలో సన్మానం చేశారు. ప్రముఖ నిర్మాతలు, దర్శకులు, ఇతర ప్రముఖులు హాజరయ్యారు. వాసన్‌గారు కృష్ణమీనన్‌గారిని ప్రశంసిస్తూ, ఆయన అంతర్జాతీయంగా భారతదేశ ప్రతిపత్తిని పెంపొందించడానికి, బ్రిటన్‌లో భారతీయ చిత్రాలను ‘పాప్యులర్’ చేయడానికి చేసిన కృషిని ఉగ్గడించారు. కృష్ణమీనన్ గారు సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ, చలనచిత్రాలు వినోదం ఇవ్వడమే కాక సాంఘిక బాధ్యతను కూడా నెరవేర్చాలని ఉద్బోధించారు. శ్రేయోరాజ్య వ్యవస్థకోసం మన దేశంలో జరుగుతున్న కృషిలో ప్రజానీకాన్ని ఉత్తేజపరచడానికి చలనచిత్రాలుకూడా ఉపయోగపడాలని ఆయన అన్నారు ★



రాగిణివారి “అర్ధాంగి” లో సావిత్రి, నాగేశ్వరరావు.

# "కావేరి"

కృష్ణా పిక్చర్స్‌వారి "కావేరి" తమిళ చిత్రం సంక్రాంతి పండుగ రోజులలో మద్రాసులోను, తమిళనాడులోను విడుదల అయినది. ఈ చిత్రాన్ని తెలుగులో కూడా "విజయగౌరి"అనే పేరుతో నిర్మిస్తున్నారు. ఇంకా కొద్దిగా పని మిగిలిఉండడంవల్ల తెలుగు చిత్రం నెమ్మదిగా విడుదలచేస్తారు. యోగానంద్ గారు డైరెక్టుచేశారు. తెలుగు చిత్రంలో ఎన్. టి. రామారావు, పద్మిని, లలిత, రేలంగి మున్నగువారు నటించారు.

"కావేరి" చిత్రం ప్రివ్యూ ఈనెల 12 వ తేదీన శ్రీకృష్ణాథియేటర్‌లో ఇవ్వబడింది. ఆ చిత్రాన్ని సెన్సార్లు పరిశీలించి 23 చోట్ల కత్తిరింపులు చేయవలసిందని ఆదేశించారట. దాదాపు 1600 అడుగుల చిత్రం ఈవిధంగా నష్టమైనదట. కత్తిరించిన భాగాల స్థానంలో తిరిగి షూట్ చేసి చేర్చడానికికూడా వీలులేని పరిస్థితి రావడంవల్ల నిర్మాతలు తొలగించగా మిగిలిన చిత్రాన్నే యథాతథంగా విడుదలచేశారని తెలుస్తున్నది. దీనివల్ల చిత్రం ఎలా దెబ్బతిన్నదీ అది చూస్తున్నంతసేపూ కనిపించుతూనే వున్నది. తెలుగు చిత్రాన్నయినా 'నీట్'గా విడుదల చేయాలని దర్శకులు యోగానంద్ గారు ప్రయత్నిస్తున్నారు.

# సతీ సక్కుబాయి

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి "సతీ సక్కుబాయి" చిత్రం దేశంలో విడుదల అయి బాగా నడుస్తున్నది. యస్. వరలక్ష్మి, కన్నాంబ, కనకం, రేలంగి, సి. యస్. ఆర్. నూరిబాబు, రఘురామయ్య, శివరావు, వంగర మున్నగువారు నటించారు. సి. యస్. ఆర్. వంగరలకు ఈ చిత్రంలో ఉన్న పాత్రలు చాలా చిన్నవి. రేలంగి సక్కుబాయి భర్త విశ్వనాథ్‌గా తన సహజస్థాయిలో నటించి, మెప్పించాడు. కృష్ణుని పాత్ర ధరించిన రఘురామయ్య, జ్ఞానయోగిగా నటించిన నూరిబాబుల నటన నాటకఫక్కీలో ఉన్నది. సక్కుబాయిగా వరలక్ష్మి బాగానే నటించింది. గయ్యాళి అత్తగా నటించినకన్నాంబ ఆ పాత్రను అతి సమర్థంగాను, యథోచితంగాను పోషించింది. కనకం, శివరావుల జంటహాస్యం ఆశేజెళ్లనాడు చలామణీ అయిన హాస్యంలాగానే ఉన్నది. సినిమాలో హాస్యం గురించి ప్రేక్షకుల అభిరుచులు చాలా మారిపోయినాయని గమనించవలసి ఉన్నది. మోటు అర్థాలు స్ఫురించేటట్లు ఒకటి రెండుచోట్ల మాటలు విసిరించటం కూడా జరిగింది. ఇదికూడా శోచనీయమైనది. సంభాషణలు కొంతసేపు నాటక సంభాషణల పద్ధతిలోను కొంతసేపు సినిమా సంభాషణల పద్ధతిలోను నడిచాయి.

# నేషనల్ ఆర్టువారి రెండో చిత్రం

నేషనల్ ఆర్ట్ థియేటర్ వారు తమ రెండవ చిత్రం ప్రారంభోత్సవం ఈనెల 19 వ తేదీ ఉదయం 9 గంటలకు వాహినీ స్టూడియోలో జరిపారు. వీరి మొదటి చిత్రం "తోడుదొంగలు". ఈ రెండవ చిత్రానికి ఇంకా పేరుపెట్టలేదు. ఇందులో అంజలీదేవి, ఎన్. టి. రామారావు, రేలంగి కాంతారావు, రాజనాల, గుమ్మడి, వహీదా అనే కొత్తనటి, సీత నటిస్తారు. 19 వ తేదీన ఈచిత్రం షూటింగ్ ప్రారంభమైనది. డైరెక్టరు యోగానంద్. ★

# ద్రవీభూత తుహినాద్రి

(11-వ పేజీ తరువాయి)

'ఔను. అది సహజమే. కాని నువ్వేమీ జంకకు. మీ నాన్న నాకిచ్చిన ఆరొందల్లోనూ చంద్రమౌళికి వుద్యోగం, పెళ్ళి-రెండూ ఒకేసారి జరుగుతాయి.'

'కాని అక్కడికి వెళ్ళడం ఎలాగ? మీరు చెప్పేది నాకర్థంకావడంలేదు.' అన్నది ఇందిర.

అతను మెల్లగా నవ్వుతున్నాడు.

'ఆ ఏర్పాట్లన్నీ నేను చేసేవుంచాను. రిక్షా పెరటిగుమ్మంలో వుంది. రైలు మరో గంటకల్లా వస్తుంది. చంద్రానికి వైర్ చేశాను. అతను స్టేషనుకొస్తాడు. నీకు తోడుగా మా చెల్లెలు వసంత కూడా కలకత్తా వొస్తుంది. త్వరగా బయల్దేరు.' అంటూ లేచి నించున్నాడతను.

ఇందిర ఆశ్చర్యపోయింది- 'మరి మీరు?' అన్నది.

'నే నిక్కడ పని పూర్తిచేసి వొస్తా!'

'ఏం చేస్తారు'

'నిన్న రైలెక్కించి వచ్చి పెళ్ళిపీటల మీద కూర్చుంటా. పెళ్ళికూతురు కన్పించలేదని గల్లంతుచేస్తారు. నన్నిలా అమర్యాదపాలు చేస్తారా' అని నేనూ మనుపర్కాలు విప్పి పారేసి రైలెక్కుతాను. సరే నువ్వు ముందు పద.' అన్నాడు.

ఇందిర భగవంతుణ్ని తల్చుకుని రిక్షాలో కూర్చుంది. ఆరొందల రూపాయలతోనూ నిండుగావున్న మనీపర్సు ఇందిరచేతి కిచ్చాడతను. 'వసంతా! జాగ్రత్తగా చూడు!' అంటూ, నిశీథాన్ని చీల్చుకుని పోతూన్న ఆ కలకత్తా రైలుపెట్టెలవైపుచూసి తృప్తిగా నవ్వుతున్నాడు. కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించింది ఇందిర. ★

